వైదిక ధర్మసంజీవినీ గ్రంథమాల. 2.

# భారతీసాంప్రదాయము

శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకర పదమావేశ

ప్రకాశిత





జగద్గురు

శ్రీకల్యాణానంద భారతీ

మహాంతాచార్యస్వామి

వారిచే

విరచితము.

ప్రకాశకుడు:

శ్రీ పరిమి నారాయణశర్మ

శ్రీపీఠకార్యదర్శి, తెనాలి.

1929

మూల్యము ౧—౮—౦

టైటిల్ పేజి లలితా ముద్రాక్షరశాలయందు ముద్రితము.

వైదిక ధర్మసంజీవినీ గ్రంథమాల. 2.

# భారతీసాంప్రదాయము

శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకర పదమావేశ
ప్రకాశిత



జగద్గురు
శ్రీకల్యాణానంద భారతీ
మహంతాచార్యస్వామి
వారిచే
విరచితము.



ప్రకాశకుడు:
శ్రీ పరిమి నారాయణశర్మ
శ్రీ పీఠకార్యదర్శి, తెనాలి.
1929
మూల్యము ౧—౮—౦

టైటిల్ పేజి లలితా ముద్రాక్షరశాలయందు ముద్రితము.

# శ్రీ భారతీసాంప్రదాయము.

27114
25.9.13



"నారాయణ సమారంభాంవిద్యా శంకర మధ్యమాం।
శ్రీబోధా నందపర్యంతాం వందేగురు పరంపరామ్ ॥"

శ్రుతి స్మృతి సదాచార ప్రమాణ బద్ధులగు చాతుర్వర్ణ్యాశ్రముల వారల కును నాచంద్రతారకమగు గౌరవమునొసంగు విద్యావంశము భారతీ సాంప్రదాయముగావున స్వీయవిద్యావంశమును గుర్తెరుంగదలచిన భారతీయుల కెల్లరకును భారతీసాంప్రదాయ స్వరూపజ్ఞాన మావశ్యకము. అట్టిజ్ఞానమును వైదికధర్మానుయాయులకు సుకరంబుగ గలుగుటకుగాను భారతీసాంప్రదాయ [illegible] నొకింత సంక్షేపంబుగ బ్రదర్శింపు చున్నారము. భారతీసాంప్రదాయము [illegible] పరమహంస పరివ్రాజకాచార్య సాంప్రదాయములలో [illegible] జేసి యగ్రగణ్యము. దానంజేసి యీసాంప్రదాయము జగద్గురు సాంప్రదాయమను నతిశయముతో నలరారుచున్నయది. ఈసాంప్రదాయము వేదవిహిత ధర్మముయొక్క నిరతిశయఫలమును గమ్యస్థానము నగుటంజేసి వైదికధర్మానుయాయులందఱకును దృష్టిపథముననుండి తీఱవలయును. అందు బ్రాహ్మణులకు నత్యావసరము. ఈసాంప్రదాయము దృష్టిపథముననుండనిచో వైదికధర్మమహా ఫలమును బడయుటకుగల నియతకారణత్రయంబున ముఖ్యకారణంబగునాచార్యుడు దూరమగును. ఆచార్యుడు దూరమైన విద్యావంశము దూరమగును. విద్యావంశమునకు దూరమైనచో నిహపరనిశ్శ్రేయసముల మూడిటికి దూరమగుగావున నాచార్య సాంప్రదాయమగు భారతీసాంప్రదాయ జ్ఞానమత్యావసర విషయమని వేఱవచింప నక్కఱలేదు.

భారతీసాంప్రదాయము దశవిధపరమహంస పరివ్రాజకాచార్య సాంప్రదాయములలో నగ్రగణ్యమగుటచే నద్దానితత్త్వమును గుర్తెరుంగుటకు మున్ముందుం బరమహంస పరివ్రాజకాచార్య తత్త్వజ్ఞాన మావశ్యకముగావున నద్దాని నొకింత నిరూపించెదము.

పరిషదనుజ్ఞ:— ఇహజన్మమునగాని లేక జన్మాంతరమునగాని శ్రుతిస్మృతి

సదాచార సిద్ధంబులగు నిత్యనైమిత్తిక కర్మంబుల నాచరించుటచే దురితక్షయముగాఁ జిత్తశుద్ధిగల్గి సాధన చతుష్టయసంపద నందినపురుషుఁడు బ్రహ్మచర్యమునుండికాని గార్హస్థ్యమునుండికాని లేదా వానప్రస్థమునుండికాని సన్న్యాసమునుఁ జేకొనవలయును. అట్లు సన్న్యాసమునుఁ జేకొనఁదలంచిన పురుషుఁడు పరమహంస పరివ్రాజకాచార్యుఁడగు నొకగురువు నాశ్రయించి యాతనియనుగ్రహము వడసి సన్న్యాసమునుఁ జేకొనుటకుఁ బరిషదనుజ్ఞనుఁ బ్రార్థింపవలయును. సన్న్యాసము జేకొనఁదలచినవానికిఁ బరిషదనుజ్ఞవలని ప్రయోజనమెద్దియన వైరాగ్యవంతులైనను సన్న్యాసమునం దిచ్ఛజనించినను సన్న్యాసమునుఁ జేకొనుటకు శాస్త్రముచే నిషేధింపఁ బడినవారలు సన్న్యాసమునుఁ జేకొనఁగూడదు. సన్న్యాసమునకు శాస్త్రీయయోగ్యతగల వారలే సన్న్యసింపవలయును. అట్టియోగ్యత లేనివారలెంతవైరాగ్యవంతులైనను సన్న్యసింప వీలులేదు. అట్టి యోగ్యతాయోగ్యతా విచారము పరిషదధీనము గావున సన్న్యసింపదలచిన వారలకుఁ బరిషదనుజ్ఞ యత్యవసరము సన్న్యాసము నిషేధింపఁబడినవారలను శ్రుతిస్మృతులిట్లు నిరూపించుచున్నవి. "అథ షండః పతితోఽంగవికలః స్త్రైణః బధిరోఽర్భకో మూకః పాషండశ్చ క్రీలింగీకుష్ఠీ వైఖానసహరద్విజౌ । భృతకాధ్యాపకశ్శిపివిష్టోఽనగ్నికో నాస్తికో వైరాగ్యసహితోప్యేతే సన్న్యాసానర్హాస్సన్న్య స్తాయద్యపిమహా వాక్యోపదేశేనాధి కారిణః ॥ ఆరూఢపతితాపత్యం కునఖీశ్యావదంతకః । క్షయీతథాంగ వికలో నైవసన్న్యస్తు మర్హతి ॥ సంప్రత్యవసితానాంచమహా పాతకినాంతథా । వ్రాత్యానామ భిశస్తానాం సన్న్యాసం నైవకారయేత్ ॥ పతితానాం లక్షణమాహ"—"అసిజీవీ మసిజీవీ దేవలో గ్రామ్యయాజకః ధావకః పాచకశ్చైవషడేతే పతితాద్విజాః ॥" ఇఁక దశవిధ బ్రాహ్మణులలో దేవమునిద్విజులను మూఁడుతరగతుల వారలకుఁదక్క నితరులకు సన్న్యాసార్హతలేదు. "దేవో మునిర్ద్విజో రాజా వైశ్యః శూద్రో నిషాదకః। పశుర్మ్లేచ్ఛోఽథ చాండాలో విప్రా దశ విధాస్స్మృతాః ॥ అనియత్రిదశవిధ బ్రాహ్మణుల నిరూపించియున్నాఁడు. పరిషదనుజ్ఞయొక్క యావశ్యకతను "యథోక్తాచారిణం భిక్షుంగురుమేకం పరిగ్రహేత్ । యతిబృందైరనుజ్ఞాతో మోక్షాశ్రమము పాశ్రయేత్" "అనుబహ్వృచపరిశిష్టవాక్యము విధించుచున్నది. దానంజేసి పరిషదనుజ్ఞవడయనివాని సన్న్యాసము వేషమాత్రమునఁ బర్యవసానమునొంది శిష్టజనపూజ్యతనుఁ బడయనేరదు. గావున

సన్న్యాసము సేకొనువానికిఁ బరిషదనుజ్ఞ ప్రథమకృత్యముగాఁ దలంచఁబడుచున్నది.

ప్రాయశ్చిత్తము:—పరిషదనుజ్ఞవడసినపిదప కృచ్ఛ్రప్రాయశ్చిత్తము నాచరింప వలయునని "కుర్యాత్కృచ్ఛ్రాణి చత్వారిసన్న్యసేప్సుర నాశ్రమీ । ఆశ్రమీకృచ్ఛ్రమేకంతు కృత్వాసన్న్యాసమర్హతి" యనుకాత్యాయ నవాక్యము విధింపుచున్నది. పిమ్మట గాయత్రీపురశ్చరణముఁ గావింపవలయు.

అష్టశ్రాద్ధములు:—పిమ్మట "దైవమార్షం తతోదివ్యం మానుష్యం భౌతికం తతః। పిత్ర్యాణాం దివ్యమాతృణా మాత్మనోవృద్ధితత్పరమ్ । అనుస్మృత్యుక్తములగు నష్టశ్రాద్ధముల నాచరింపవలయును.

సావిత్రీ ప్రవేశనాదికము"— శ్రాద్ధముల ముగించిన మరుసటి దినమున వపనముసేసికొని యథావిధి స్నానముసేసి హోమాదిద్రవ్యములను దండాదులను సమకూర్చుకొని దేవాయతనమున నోజల సమీపముననోయుండి సావిత్రీ ప్రవేశన బ్రహ్మాన్వాధాన సాయంతనకృత్యముల ముగించి రాత్రియందు జాగరముసేయువలయును ఏతద్విషయమున శౌనకవిధి యిట్లుఁబరగుచున్నది. "పూర్వే ద్యుర్నాందీముఖం కృత్వా బ్రాహ్మణాన్భోజయిత్వా పుణ్యాహం వాచయిత్వా కేశశ్మశ్రులోమనఖానివాపయిత్వా యథావిధి స్నాత్వా హోమాది ద్రవ్యజాత వ్యతిరిక్తం ద్రవ్యం పుత్రాదిభ్యోదత్వాదం డాదీన్సన్నిధాయ దేవాయతనే గ్రామేవా పులినేవారణ్యే వాస్థిత్వా బ్రహ్మాంజలింకృత్వా మానసంజపిత్వా ఉపస్పృశ్య దర్భాంజలిం కృత్వా వేదాదీన్జపిత్వా సక్తుముష్టిం ప్రాశ్యాచమ్య సావిత్రీ ప్రవేశనం కృత్వా పురస్తాదాదిత్యస్యా స్తమయాత్పూర్ణాహుతిం హుత్వాసాయమగ్ని కార్యంకృత్వా గృహ్యోత్తరదేశే దర్భేషుపాత్రాణిసాదయిత్వాగ్ని దక్షిణదేశేదర్భాన్సం స్తీర్యకృష్ణాజినంచాంతర్ధాయ ఏతస్యాం రాత్ర్యాంజాగరంకృత్వేతి" అత్రపూర్ణాహుతావధికారిభేదేనభేదోపివ్యవ స్థాపితః బోధాయనేన" తతోస్తమయాత్పూర్వ మాహితాగ్నిశ్చే దాహవనీయే ఏకాగ్నిశ్చేదౌ పాసనాగ్నౌ బ్రహ్మచారీచే ల్లౌకికేఽగ్నౌ విధురశ్చేత్పూర్వోక్తే నవృష్టాదివిధానేనో త్పాదితేఽగ్నౌ" ఇతి:—

అగ్నిసమారోపణము:—"పిమ్మట బ్రాహ్మీముహూర్తమున లేచియథావిధి స్నానముసేసి ప్రాతరగ్నికార్యమొనర్చి యాహితాగ్నియైనచోఁ బ్రాజాపత్యేష్టిని గాని, ఆగ్నేయేష్టినిగాని, ఏకాగ్నియైనచో నాగ్నేయస్థాలీపాకమునుఁజేసి తదనం

తర మగ్నిసమారోపణము సేయవలయును. ఏతద్విషయమున “ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం సర్వవేద సదక్షిణామ్. ఆత్మన్యగ్నీన్సమారోప్య బ్రాహ్మణః ప్రవ జేద్గృహాత్” అని మనువునిర్వచించి యున్నారలు.

జలాశయకృత్యము:—పిమ్మట జలాశయమునకుఁ బోయి పుత్రాదులకు సంతసమునుఁ గలుగఁజేసి సంకల్పముగావించి ప్రైషోచ్చారణా భయదానంబుల గావించి యజ్ఞోపవీతము జలమున హోమముసేసి శిఖార్థమై యుంచఁబడిన కేశముల నూడఁబెరికి జలమునఁ గాని భూమిపైనఁగాని విడచిపెట్టి విష్ణుప్రార్థనముగావించి జలాశయమునుండి దిగంబరుడై వెలుపలికివచ్చియుత్తరదిశనుఁగూర్చి కొంచెము నడచి తిరుగ వెనుకకుమరలి యథాధికారము యథావిధి కటిసూత్ర కౌపీన కాషాయాంబరముల ధరించి దండమును గ్రహింపవలయును. ఏతద్విషయమైవాక్యములు“సాగ్నికస్తూక్తేన విధినాగ్నిసమారోపం విధాయజలాశయం గచ్ఛేత్ తతఃపుత్రందృష్ట్వాత్వం బ్రహ్మేత్యాదివాక్యత్రయం జపేత్ । తతఆశ్రమాత్సన్యాసం గచ్ఛామీతి సంకల్పయేత్ । తతోఽప్స్వోదకాహుతిద్వయం హుత్వాయజ్ఞోపవీతం విసృజ్యాద్భిః సంస్పృశ్యాప్సుజుహోతి వేదాంతేతి । తతశ్శిఖార్థం రక్షితాన్కేశానుత్పాట్య భూస్స్వాహేతి భూమావప్సువానిక్షిపేత్ । సన్యస్తం మయా సన్యస్తం మయాసన్యస్తం మయేతి త్రిరుక్త్వాభయం సర్వభూతేభ్యః మత్తస్సర్వం ప్రవర్తతే సఖామాగోపాయా జస్సఖాయోసీం ద్రస్యవజ్రోసీత్యనేన మంత్రేణ కృతోర్ధ్వం వైణవందండంకౌపీనం పరిగ్రహేదితి:—

సన్యాసస్వరూపము:—సన్యాసమున సర్వమును విడచిసంకల్పపూర్వకముగ ప్రైషోచ్చారణా భయదానముల గావించి శిఖాయజ్ఞోపవీతముల త్యజించి కటి సూత్రకౌపీన కాషాయాంబరముల ధరియించి దండమునుగ్రహించుట నాందీముఖము మొదలు దండగ్రహణాంత క్రియాకలాపమీ సన్యాసమునకంగరూపము.

గురూపసదము:—పైనఁజెప్పఁబడిన క్రమమున సన్యాసమునుఁజేసి యాత్మజ్ఞానముకొఱకు గురుసమీపమునకుబో వలయునని “పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్స మిత్పాణిశ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥ అను శ్రుతి శాసింపుచున్నది.

ప్రణవమహావాక్యోపదేశము:— గురువును సమీపించి పాదగ్రహణము సేసి యథావిధి యాతనివలనఁ బ్రణవమహావాక్యోపదేశమునుఁ బడయవలయును.

గురులక్షణము:- "తురీయాతీతావధూతయోర్మహావాక్యోపదేశికారః|పరమహంసస్యాపి" "యను శ్రుతి శాసనముననుసరించి తురీయాతీతునో యవధూతనోపరమహంసనో గురువుగ గ్రహింపవలయును. వీరలలక్షణము మున్ముందువివరింపఁబడును.

దీక్షావిధి:—గురువన్ననో దీక్ష సేసి యథావిధి ప్రణవమహావాక్యోపదేశముగావించి తనశిష్యునకు నామకరణము గావింపవలయును. అట్టినామము తత్త్వంపదార్థముల యైక్యమును బోధింపునదిగానుండవలయునని సాంప్రదాయవిదులు వల్కుచున్నారలు. "తత్త్వంపదార్థయోరైక్యం యత్పదంప్రతిపాదయేత్ తన్నామయతయే కుర్యాద్వాక్యనామ తదిష్యతే" ఇతి. అట్టివిషయమున ఖ్యాతిగాంచిన పూర్వాచార్యుల నామముల నెంతమాత్రమునుంచగూడదు. పిమ్మటగురువు శిష్యునకు నుపనిషదంతర్గతంబులగుఁ బరమహంసధర్మముల నుపదేశింపవలయును.

దీక్షానంతరకృత్యము:— దీక్షనుఁబడసిన పిమ్మట నీతడు పరమహంసపరివ్రాజకనామముచే వ్యవహరింప నర్హతనుఁ బడయును. ఇట్టి పరమహంస పరివ్రాజకుడు వివిదిషువైనచో దీక్షానంతరము గురుసన్నిధియందున పరోక్షాత్మజ్ఞానమునుఁ బొందువఱకు శ్రవణాదికమునుఁ జేసియు, విద్వాంసుడైనచో నచిరకాలములోనఁ గృతకృత్యుడయ్యు గుర్వనుగ్రహమునుఁ బడసియు యోగపట్టాభిషిక్తుడు గావలయును. యోగపట్టవిధి సాంప్రదాయ విదులచే నిట్లునిర్వచింపఁబడి యున్నది. "అధీతవిద్యః సభ్యశ్చేద్దద్యాద్యోగ పట్టంగురుః | పాదౌమృదా త్రిఃప్రక్షాల్య పాదుకాభ్యాంగృహం వ్రజేత్ ద్విగుణం కటిసూత్రంచ బధ్వావాసోఽవగుంఠ్యచ | ఉచ్చాసనంప్రకల్ప్యైవ విశేత్తత్రాజ్ఞయాగురోః | సభ్యాదిష్టము పన్యస్య వేదాంతేకించిదేవతు | గురుణావిధివన్న్యాసపూర్వం శంఖాభిషేచనం | వాసోమాల్యాదికందత్వా గురుణాయతిభిస్సహ | నమస్కృత్య ప్రపూజ్యాథ స్తోత్రాణిచపఠేత్తథా | వస్త్రంచోపరిసంధార్యబంధుభిర్యతిభిస్సహ | గీతాధ్యాయంవిశ్వరూపం భుంక్త్వారాద్యంతమేవచ | తతోనామప్రకర్తవ్యం గురుణాసర్వసమ్మతం | తీర్థాశ్రమవనారణ్య గిరిపర్వతసాగరాః | సరస్వతీ భారతీ చపురీనామానివైదశ| శ్రీపాదసంజ్ఞయావాచ్యం నామతస్యయథాతథమ్ | అద్యారభ్యత్వ యాకార్యం

దీక్షావ్యాఖ్యాదికం సదా । యోగపట్టోపిదాతవ్యః శిష్యేసమ్యక్పరీక్షితే । ఇత్యాజ్ఞాంగురుణాదత్తాం గృహీత్వాశిరసాస్వయమ్। ఉత్థాయచతతస్సమ్యక్కృత్వా త్పాదగ్రహోన్వితమ్ । సదోరకంనమస్కృత్యాద్గురుం జ్యేష్ఠయతీంస్తథా” ఇతి. ఇట్టియోగపట్టాభిషేకమును బొందినమహనీయుడు పరమహంస పరివ్రాజకాచార్యుడను సార్థకతనుం బడయును. ఇట్టిపరమహంస పరివ్రాజకాచార్యునే విద్వత్పర మహంసయనిగూడ బుధులువక్కాణింపుదురు. ఇట్టిపరమహంస పరివ్రాజకాచార్యుడే యితరులకు వ్యాఖ్యానోపదేశములం జేయుటకును లెస్సగా శిష్యునిం బరిశీలించి యోగపట్టము నిచ్చుటకును అననాచార్యత్వము నొకరికినిచ్చుటకును స్వతంత్రత గలిగి యుండుటచే నధికారముగలవాడు. తదితర సన్యాసులెంత మాత్రము నర్హులుగారు. శ్రీవిద్యాశంకర భగవత్పాదాచార్యాది మహనీయుల చరిత్రములిచట నిరూపింపఁబడిన సన్యాసవిధికి లక్ష్యములు:— విద్వత్సన్యాసము:— సన్యాసము శాస్త్రదృష్టిననుసరించి వివిదిషా సన్యాసము విద్వత్సన్యాసమని రెండువిధములు. అందువివిదిషాసన్యాసము కుటీచకబహూదక హంసపరమ హంసలను నాలుగువిధములఁ బరగుచున్నది. విద్వత్సన్యాసమన్ననో పరమహంసతురీయాతీతావధూతలను మూడు విధములఁ బరగుచున్నది. అందు వివిదిషాసన్యాసాంతర్గత పరమహంస సన్యాసము వివిదిషాపరమహంస సన్యాసమనియు విద్వత్సన్యాసాంతర్గత పరమహంస సన్యాసము విద్వత్పరమహంస సన్యాసమనియును బుధులచే నెన్నఁబడుచున్నది. దానంజేసిపరమహంస సన్యాసము వివిదిషా విద్వద్భేధముల చేద్వివిధమని తెలియవచ్చెడిని సన్యాసులు వివిదిషావస్థయందుఁ దీవ్రేచ్ఛచే విద్వదవస్థనుఁ బొందగురుసన్నిధియందు యథావిధిశ్రవణాదికమునుఁజేసి తీఱవలయును. విద్వదవస్థయందు లోకసంగ్రహమునకై వ్యాఖ్యానోప దేశాదికమును యథావిధిచేయుచు సాంప్రదాయము నభివృద్ధిసేయవలయును. విద్వత్సన్యాసులకు శాస్త్రమువిధించు మర్యాదలనొకింత సంక్షేపంబున నిరూపింపఁబడును:– విద్వత్త్వమునుఁ బడసెడి కుటీచకాదుల నుద్దేశించి శ్రుతియిట్లు వక్కాణింపుచున్నది:– “సోయమాత్మాత్రక్రమేణ కుటీచకోబహూదకత్వం ప్రాప్యబహూదకోహం సత్వమనలంబ్యహంసః పరమహంసోభూత్వా స్వరూపానుసంధానేనసర్వప్రపంచం విదిత్వాదండకమండలు కటిసూత్రకౌపీనాచ్ఛాదనస్య విధ్యుక్తక్రియాదికం సర్వమప్సునస్యస్యేతి॥ తురీయాతీతావధూతోపనిషత్”

"యదాలం బుద్ధిర్భవేత్తదా కుటీచకో వా బహూదకో వా హంసో వా పరమహంసో వా తత్తన్మంత్ర పూర్వకం కటిసూత్రం కౌపీనం దండం కమండలుం సర్వమప్సు విసృజ్యాథ జాతరూప ధరశ్చరేత్" ఇతిపరమహంస పరివ్రాజకోపనిషత్.

అలంబుద్ధి యనగ్గా కృతకృత్యత, అపరోక్షాత్మజ్ఞానము, విద్వదవస్థ యని గ్రహింపునది. అద్దానికి నిదర్శనము యోగపట్టాభిషేకము, యోగపట్టాభిషేకమునుం బడసిన తరువాత వివిదిషా చిహ్నంబులగు దండాదుల యథావిధిత్యజించి సాంబరుడై కాని దిగంబరుడై కాని చరింపుచు లోకసంగ్రహమును నిర్వేచ్ఛముం జేయునది. ఏతద్విషయమై శ్రుతియిట్లు వక్కాణింపుచున్నది. "నతస్యవిద్యతే కార్యం నలింగం వావిపశ్చితః। నిర్మమో నిర్భయశ్శాంతో నిర్ద్వంద్వో వర్ణభోజనః। మునిః కౌపీనవాసాస్స్యాన్నగ్నో వాధ్యానతత్పరః। ఏవంధ్యానపరో యోగీ బ్రహ్మభూయాయ కల్పతే" ఇతి నారద పరివ్రాజకోపనిషత్" ఆ తీరుననే "జీర్ణకౌపీనవాసాస్స్యాన్ముండీ నగ్నోథవా భవేదితి".

"దండహీనో యతిర్శీఘ్రం యతి త్యాద్ధీయతే ధ్రువమ్" ఇత్యాది వాక్యములచే దండత్యాగము ప్రత్యవాయ హేతువుగాం దలంచంబడుచుండ దండత్యాగమునుం జేసినవార లుపదేశాస్తా లెట్టులగుదు ర్నాలనినన్ట్టి నిషేధము విద్వదవస్థనుంజెందక మునుపటచే దండత్యాగము సేసెడువాని విషయముగాని వేరొండు కాదనియునట్లుం దలంచుటచే సకల శ్రుతి వ్యాకోపము సు మహాదోషము ఘటిల్లు గావున నట్టి యభిప్రాయమునుం బ్రాజ్ఞులు దలపెట్టంగూడదు. విద్వదవస్థనుంజెంది దండాదికమునుం ద్యజించి లోకసంగ్రహమునకై చరింపు మహాపురుషులనుం బరమహంస పరివ్రాజకాచార్యులనియు విద్వత్పరమహంసలనియుం దురీయాతీతులనియు నవధూతలనియు బుధులు శాస్త్రదృష్టిచే బహుభంగుల వర్ణింపుచున్నారలు, అవధూతయను మహాపురుషుం డొడలెఱుగకయుం బ్రపంచమునుం దెలియకయు గ్రాహ్యగ్రాహ్యాదికమట్లుం బడియుండవలసిన విషయమును నాతడు వ్యాఖ్యానోపదేశాదికము నెట్లు జేయగలుగునని నదో నయ్యది దురభిప్రాయమనియు నవధూత యొక్క పరిస్థితులనుం గూర్చి యవధూతోపనిషద్వాక్యములం దిలకించిన యథార్థము దేటపడుననియు నవ్వాని నుదహరింపుచున్నారము:—అథవాకృతకృత్యోస్యాం లోకానుగ్రహకామ్యయా శాస్త్రీయేనైవ మార్గేణవర్తేహం మమకాక్షతిః దేవార్చనస్నాన శౌచాచావర్గదాంపవుః తారం

జపతువా క్తతద్వత్పరత్వామ్నాయమస్తకం విష్ణుంధ్యాయతుధీర్యద్వా బ్రహ్మానందేవిలీయతామ్। సాక్ష్యహంకించిద ప్యత్రనకుర్వేనాపికారయే। కృతకృత్యతయాపునరితి॥

ఇట్టి విద్వత్సన్న్యాసులే సాంప్రదాయ ప్రవర్తకాచార్యులుగ బుధులచేఁ దలంచఁబడుదురు. యోగపట్టాభిషేకముచేఁ బరమహంసకు సాంప్రదాయము లభించును. అట్టి సాంప్రదాయములు శ్రీవిద్యాశంకర భగవత్పాదాచార్యులవారిచే దశవిధములుగ వ్యవస్థసేయఁబడినట్లు సకలలోక విదితము.

ఇంతవఱకుఁ గుటీచకాదులు విద్వత్త్వము నెందననుసరింపవలసిన విధినిరూపింపఁబడెను, ఇఁక జన్మాంతర పుణ్యపుంజ పరిపాకవశమున బ్రహ్మచారికిఁగాని గృహస్థునకుఁగాని వనప్రస్థునకుఁగాని విద్వత్త్వము లభించినచో నట్టివాఁడేమి చేయవలయునను విషయము నొకింత నిరూపించెదము, నారదపరివ్రాజకోపనిషత్తునందు "స్వపుత్రమిత్రకళత్రాప్త బంధ్వాదీన్స్వాధ్యాయంచ సర్వకర్మాణిచ సన్న్యస్యాయం బ్రహ్మాండంచ హిత్వాసర్వం కౌపీనందండ మాచ్ఛాదనం చత్యక్త్వా" ఇతి పరమహంస పరివ్రాజకోపనిషత్తునందు "బ్రహ్మాహమస్మీతి తత్త్వమస్యాది వాక్యార్థస్వరూపసంధానంకుర్వన్ ఉదీచీదిశంగచ్ఛేజ్జాతరూపధరశ్చరే దేషసన్న్యాసస్తదధికారీభవేద్యది గృహస్థప్రార్థనాపూర్వకమభయం సర్వభూతేభ్యోమత్తస్సర్వం ప్రవర్తతే। సఖామాగోపాయోజ ఇత్యనేనమంత్రేణ ప్రణవపూర్వకం సలక్షణం వైణవందండంకటిసూత్రం కౌపీనం కమండలుంవివర్ణవస్త్రమేకం పరిగృహ్యసద్గురుముపగమ్య నత్వాగురుముఖాత్తత్త్వమసీతివాక్యం ప్రణవపూర్వకముపలభ్య" ఇతి గృహస్థుఁడట్టెసన్న్యాసార్హుఁడయ్యు నాందీముఖాది దండగ్రహణాంత కర్మరూపమగు సన్న్యాసమునాచరించి సద్గురుముఖమున నుపదేశమువడసి తీరవలయును. అట్లుగానిచో నధఃపతనము నెందును. సాంప్రదాయసిద్ధిలేమిచే గురుపంక్తి విహీనుఁడగును, "గురుపంక్తివిహీనస్తుభవేత్పంక్తివర్జితః" యను నీశ్వర శాసనముచే నట్టివాఁడు పంక్తిబాహ్యుఁడగుచున్నాఁడు, విద్వత్సన్న్యాసియగు గృహస్థు దండగ్రహణాదికము లేక యేయుపదేశాదికమును బడయఁగూడదా యనిన నుపదేశమునకై గురుసమీపమునకు బోవలయుకదా, గురుసమీపమునకు బోవుటకుఁగాను దండాదికము కర్మాంగముగనే సిద్ధమగుచుండ నయ్యదిలేకుండ గురుసన్నిధికిఁ జేరుటెట్లులో కర్మస్వరూపజ్ఞానకుశలులు యోజింపవలసిన విషయము. గృహస్థెంతటి విద్వాంసుఁడైనను నాందీముఖాద్యగ్ని సమారోపణాంత కర్మకలాపము

నాచరించితీరవలయును గదా. పిమ్మట గదా జలాశయకృత్యము. అగ్నిసమారోపణమునకు బూర్వకృత్యమగు ప్రాజాపత్యేష్టియందుగాని, వైశ్వానరీయేష్టియందుగాని లేదా స్థాలీపాకమందుగాని పాత్రాసాదనంబున దండాదికమునాసాదనసేసి యచ్చట నాసాదింపఁబడిన దండాదికమును జలాశయమునుండి దిగంబరుఁడై వచ్చిన పిదప ధరించి గురుసన్నిధికి బోవలయునని తేటపడుచున్నది. కేవల దిగంబర భావముతో జలాశయమునుండి వెడలివచ్చిన వాడంతటనె గురుసన్నిధికి బోవుటయు అట్టివానికెట్టి దీక్షావిధానములేకుండ దిగంబరిగ నుపదేశముసేయుటయు అద్దానిచే సాంప్రదాయసిద్ధిగల్గునని తలంచుటయు నెచ్చటను వినరాదు. విద్వత్సన్న్యాసము బడసిన శుకాదులు దండాదులఁద్యజించినట్లు సర్వవిధముల వినబడుచున్నది. "తత్ర పరమహంసా నామ సంవర్తకారుణి శ్వేతకేతు దూర్వాస ఋభు నిదాఘ దత్తాత్రేయ శుక వామదేవ హారీతక ప్రభృతయోఽవ్యక్తలింగా అవ్యక్తాచారా అనున్మత్తా ఉన్మత్తవదాచరంతః పురపరాఙ్ముఖా త్రిదండం కమండలుం భుక్తపాత్రం జలపవిత్రం శిఖాం యజ్ఞోపవీతం చ బహిరంతశ్చేత్యేతత్సర్వం భూస్స్వాహేత్యప్సు పరిత్యజ్యాత్మానమన్విచ్ఛేద్" ఇతి యాజ్ఞవల్క్యోపనిషత్"

ఇచ్చట నుదహరింపఁబడినవారలే బ్రహ్మవిద్యా సంప్రదాయ ప్రవర్తకాచార్యులగు పరమహంస పరివ్రాజకాచార్యులని ముల్లోకము నెరిగిన విషయమే॥ దానంజేసి విద్వాంసునిచేఁ జేయంబడు దండాదిత్యాగము శ్రుతిస్మృతి సదాచారసిద్ధమై సకలలోకపూజ్యమైయొప్పుచున్నయది. ఇట్టి సకలలోక పూజ్యతను పరమహంస పరివ్రాజకోపనిషత్తిట్లు వర్ణించుచున్నది. "స సర్వకృత్స బ్రాహ్మణస్స బ్రహ్మనిష్ఠాపరస్స దేవస్స ఋషిస్స తపస్వీ స శ్రేష్ఠస్స ఏవ సర్వజ్యేష్ఠస్స ఏవ జగద్గురుస్స ఏవాహం విద్ధి। లోకే పరమహంస పరివ్రాజకో దుర్లభతరో యద్యేకోఽస్తి స ఏవ నిత్యపూతస్స ఏవ వేదపురుషో మహాపురుషో యచ్చిత్తం మయ్యేవావతిష్ఠతే। అహం చ తస్మిన్నేవావస్థిత" ఇతి॥

ఇట్టి పరమహంస పరివ్రాజకునే యవధూతోపనిషత్తు వధూతగా వర్ణించుచున్నది. "యోఽయమవధూత మార్గస్థో లోకే దుర్లభతరో న తు బాహుళ్యో యద్యేకో భవతి స ఏవ నిత్యపూతస్స ఏవ వైరాగ్యమూర్తిస్స ఏవ జ్ఞానాకారస్స ఏవ వేదపురుష ఇతి జ్ఞానినో మన్యంతే। మహాపురుషో యచ్చిత్తం మయ్యేవావతిష్ఠతే। అహం చ తస్మిన్నేవావస్థిత "ఇతి॥ ఇట్టి పరమహంస పరివ్రాజకాచార్యుని శ్రుతి జగద్గురువను గౌరవముతోఁ గొనియాడుచున్నది.

భారతీసాంప్రదాయపు టతిశయము :—పరమహంస పరివ్రాజకాచార్యుడు జగద్గురువని పరమహంస పరివ్రాజకోపనిషత్తు వర్ణించుచున్నది. దానంజేసి పరమహంస పరివ్రాజకాచార్యుడు దశవిధ సాంప్రదాయములలో నేసాంప్రదాయమునకు జెందినను జగద్గురువుగావచ్చును. దశవిధసాంప్రదాయములును జగద్గురు సాంప్రదాయములేయని చెప్పఁబడవచ్చునట్టి స్థితిలో భారతీసాంప్రదాయమే జగద్గురు సాంప్రదాయమనుటకుఁగల ప్రమాణమెద్దియన రేణుకాతంత్రమని తెలిసికొనవలయును. రేణుకాతంత్రమున దశవిధసాంప్రదాయములలో నొక్క-తీర్థాశ్రమ సరస్వతీభారతీ సాంప్రదాయములు మాత్రము బ్రాహ్మణులందుఁ బరగుచున్నవనియును దదితరములితరులయందు బరగుచున్నవనియును నిరూపించియట్టి నాలుగు సాంప్రదాయములగూర్చి వివరింపఁబడిన విశేషముల నొకింత పరిశీలించినచో భారతీసాంప్రదాయపు టతిశయము దేటువడుగావున నద్దాని నుదహరించుచున్నారము :— విద్యారణ్యః॥ "ఇతరేషుచ వర్ణేషు షడ్భేదాః ప్రకీర్తితా" ఇతి॥ కించ :— "ఏకత్రభిక్షా తీర్థానాం నిద్రాచాన్యత్రనిత్యశః। స్వశాఖోపనిషన్నిద్ధ్యానం। విష్ణోర్నామసహస్రకం। శ్రీరుద్రప్రణవంచైవ నిత్యమావర్తయేద్యతిః॥ దివాకరసహస్రాఖ్య సంఖ్యయా ప్రణవంజపేత్। ఏకత్రపంచదివసాన్నాగ్రామే భైక్షమాచరేత్।నిద్రాతత్రైవకర్తవ్యాం తతోన్యత్రవ్రజేద్ద్విజం। గీతాపాఠాదికంసర్వం సమమన్యత్పురాయథా। సప్తరాత్రం సరస్వత్యాభిక్షాన్నిద్రానికం స్మృతం। భారతీయాతయస్సర్వేయతీనాం గురవస్మృతాః। ద్విమాసం వాత్రిమాసంవాగ్రామేగ్రామే స్థితిఃస్మృతా।గీతాదిపాఠస్సర్వేషాంసమఏవోదితస్సదా। భారతీనాంవిశేషస్తు సర్వమంత్రజపస్సదా। ఆదిత్యాదిషుభక్తిశ్చతత్పూజాచతన్మి వేదనం। ఏవంవిధానికర్మాణి యతీనాం విహితానిహి॥ "ఇతి" "మహాలక్ష్మీశ్చ శాలాని పాదుకాంతానాంమంత్రాణాముత్తమంజపం భారతీయతిభిః కార్యం నిత్యమేవ నసంశయః। ఓంకారజపమాత్రం త్వన్యేషాంతువిధీయతే। ప్రణవాదస్య మంత్రాణామనుష్ఠానంతునాచరేత్। ఆచారేద్యదిమూఢాత్మారౌరవం నరకంవ్రజేత్। భారతీనాంయతీశానాంధర్మఉక్తస్సనాతనః॥ "ఇతి" అన్యచ్చ॥— మూర్ధాభిషిక్తాస్త్రివిధాః తథా సింహాసనంత్రిధా। రాజ్యసింహాసనంచైవ భాష్యసింహాసనంతథా। మంత్రసింహాసనంచేతిత్రివిధం నిర్మితంపురా। కృతరాజ్యాభిషేకశ్చ కృతసూత్రాభిషేచనం। పాదుకాంతాభిషేకశ్చత్రిధాతేకధితాభువి। భాష్యసింహాసనేచైవ మంత్రసింహాసనేతథా। సూత్రేతు పాదుకామాంచగురుభిస్త్వాంత్వభిషేచితః॥

అతోమూర్ధాభిషిక్తస్త్వం గజారోహణమాచర। యానారూఢం యతిం దృష్ట్వా సచేలస్నానమాచరేదిత్యాది శాస్త్రప్రసంసిద్ధదోషోనాస్తిహినాస్తితే॥ తద్దోషస్తుయతిశ్రేష్ఠ త్వదన్యాశ్రమిణాం స్మృతఇతి॥—పై నుదహరింపఁబడిన వాక్యములచే భారతీసాంప్రదాయపు టతిశయము సుస్పష్టముగఁ దెలియనగును. ఇంతియ కాదు. ఈ భారతీసాంప్రదాయమునకు మూలపురుషుడు శ్రీమదాదినారాయణుండు. వివర్ధనుండు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసులు. సంస్థాపకులు శ్రీ విద్యాశంకర భగవత్పాదులును, శ్రీవిద్యారణ్యులును, ఏతావన్మాత్ర మీ సాంప్రదాయపు టతిశయమును నిరూపించుటకుఁ జాలును.

ప్రతాప భారతీపీఠసంస్థాపనము.—శ్రీ పీఠము॥— కలి ద్వాపరసంధియందు వేదవ్యాసులు ధర్మసంగ్రహము సేయునపుడు ధర్మస్వరూపములగు సన్యాస సాంప్రదాయములుగూడ వ్యవస్థసెయబడెననుటకు సందియముండదు. అట్టి తరుణమున నుండు సన్యాస సాంప్రదాయములఁగూడ వ్యవస్థసేసి స్వీయ సాంప్రదాయమగు భారతీసాంప్రదాయము నభివృద్ధిచేసినటుల శ్రీకృష్ణద్వైపాయనులకుగల "భారతీవంశ వివర్ధనుడను సార్థకనామముచేఁ బ్రాజ్ఞులు గ్రహింపఁగలరు. వేదవ్యాస శిష్యులనుఁ బ్రఖ్యాతిగాంచిన పైలవైశంపాయన జైమిని సుమంతులు నలువురును భారతీ సాంప్రదాయపు పరమహంస పరివ్రాజకాచార్యులే. వేదవ్యాసులన్ననో పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు. ఇట్లు భారతీసాంప్రదాయము వేదవ్యాసులచేఁ జక్కగ నెలకొలుపబడినప్పటికిని కలిప్రాబల్యవశమునఁ గ్రమక్రమముగా సత్సాంప్రదాయములు సెడి బౌద్ధాది దుష్టపరివ్రాజకులు బయలువెడలుటచే సన్యాసము సీకాకు సెంది యంతరించునంతటి విపద్దశలో మునిగియుండ లోకశంకరుండగు శ్రీవిద్యాశంకర భగవత్పాదులు గలియుగము రెండువేల యైదునూరులతొంబదిమూడవ సంవత్సరమున వైశాఖశుద్ధ పంచమీభానువారమున నవతరించిరి. ఈవత్సరమే శాంకరశకాదిగ నిచటఁ బరిగణింపఁబడి తన్మూలకముగ భారతీసాంప్రదాయ చారిత్రమంతయు నిరూపింపఁబడును.

ఐదవ సంవత్సరమున శ్రీశంకర భగవత్పాదు లుపనయనము సేయబడి యెని మిదవవత్సరమునకు నాలుగువేదములను సాంగముగను సరహస్యముగ నధ్యయనము సేసి సర్వకర్మ సన్యాసమును యథావిధిగావించి నర్మదాతీరంబున నమలేశ్వర

క్షేత్రంబున విశ్రమించియున్న గోవిందభగవత్పాదులవలనఁ బ్రణవ మహావాక్యోపదేశాదికమును యథావిధి గ్రహించి నాలుగువత్సరములు శ్రవణాదికమునుఁ దత్సన్నిధిని యొనరిచి పండ్రెండవ వత్సరమున యోగపట్టాభిషిక్తులై వారాణశీ పురముసేరి యచట వ్యాఖ్యానోపదేశాదికముసేయుచు పదునారవవత్సరమునకు భాష్యంబుల రచించి వేదవ్యాసానుగ్రహమునకుఁ బాత్రులై శ్రీవిశ్వేశ్వరప్రసాదమునుఁబొంది దిగ్విజయముగావించి వైదికధర్మ రక్షణమునకై భారతభూమియందు నలుదెసల నాలుగుపీఠముల స్థాపించి యందుఁ దమశిష్యులలో నగ్రగణ్యుల నాపీఠములకు నధిపతులుగ నియమించిరి. అద్దాని వివరంబెట్టులనిన॥—

౧. పదునెనిమిదవ సంవత్సరమున మాఘ శుక్ల సప్తమియందు ద్వారకా క్షేత్రమున శారదాపీఠమును నెలకొలిపి యచట హస్తామలకాచార్యుల బ్రతినిధిగ నిర్దేశించిరి. ౨. ఇరువదిమూడవ వత్సరమునఁ బుష్య పూర్ణిమయందు బదరికాశ్రమమున జ్యోతిర్మఠమునుఁ బ్రతిష్ఠించి యచట త్రోటకాచార్యులఁ బ్రతినిధిగ నియోగించె. ౩. ఇరువదినాలవవత్సరమున వైశాఖశుక్ల దశమియందు జగన్నాథ క్షేత్రమున గోవర్ధన మఠమును స్థాపించి యందు పద్మపాదాచార్యులఁ బ్రతినిధిగ శాసించిరి. ౪. ఇరువదియైదవ వత్సరమున శృంగగిరిక్షేత్రమున పుష్యపూర్ణిమయందు శ్రీపీఠమునుఁ బ్రతిష్ఠించి యచట సురేశ్వరాచార్యులఁ బ్రతినిధిగ శాసించె. ముప్పదిరెండవవత్సరమునఁ గాశ్మీర దేశంబున సర్వజ్ఞపీఠాధిరోహణంబుసేసి చైత్ర శుక్ల పూర్ణిమయందు కైలాసగమనము గావించినటుల సకలలోకవిదితము.

శ్రీవిద్యాశంకర భగవత్పాదుల మహదాశయము:—శ్రీవిద్యాశంకర భగవత్పాదులీ మఠములఁ బ్రతిష్ఠించుట యందలి మహదాశయమెద్దియన:— వైదికధర్మ శిరోవతంసమగు భారతీసాంప్రదాయమును విపులముగ నభివృద్ధిసేసి తన్మూలకముగ భారతభూమియందు వైదికధర్మమును శ్రుతిస్మృతి సదాచారసరణి పరిపాలించుటయు. అదెట్టులన నంతఃకరణ పరిపాకవశంబున సాధన చతుష్టయసంపదనొంది సన్యాసము సేకొనఁదలంచిన యుత్తమపురుషుల నాయాసముగ భారతీసాంప్రదాయమును గుర్తెరింగి తాము దరించియు నితరులనుఁ దరింపఁజేయు సమర్థతనుఁ బడయుటకుగాను భారతీసాంప్రదాయపు పరమహంస పరివ్రాజకాచార్యులు సుప్రసిద్ధమగుఁ దావులందు నిలచియుండుటయు నందు ముఖ్యులచే నియమింపఁబడి యితరులు ధర్మసంగ్రహ

కార్యముల నెఱవేర్పుటయు, ఇట్లు భారతీ సాంప్రదాయము సుప్రసిద్ధస్థలంబులనెల్ల అకును దెలియఁబడియుండుటకుమారుగ నిటునటు చెదరియుండినచో నుత్తములితర సాంప్రదాయములలోఁ దగిలి తాము సెడుటయకాక నితరులఁగూడఁ జెరచుటతటస్థ మగును. అట్టి విప్రతిపత్తులనుఁదొలగించి స్వీయసాంప్రదాయము నభివృద్ధిసేయుటకే మఠంబుల నేర్పాటుసేసి చేసినశాసనంబులెవ్వియన:— సన్యాసమునుఁ జేకొనఁదలంచినవారలు యథేచ్ఛఁజరింపక పీఠసన్నిధికిఁబోయి యచ్చట యథాధికారముఁ దమ తమ యభీష్టంబుల నెఱవేర్చుకొనుటయు; పీఠాధిపతుల యనుజ్ఞలేకుండ నిజేచ్ఛ సన్యాసములఁ జేకొనినవారలచే లోకము మోసపుచ్చఁబడకుండఁ గాపాడుటయు వేయేల శ్రుతిస్మృతి సదాచార సంప్రదాయపు సన్యాసులకునుఁ దదితరులకునుఁ గల భేదమును సకలజనులు లెస్సగఁ దెలిసికొని యందువలనఁ గలుగు లాభాలాభములనుఁ దెలిసికొని వ్యవహరింపుటయు ముఖ్యాశయము. ఇదియట్టులుండ శ్రుతిస్మృతి సదాచార సిద్ధంబులగు వర్ణాశ్రమధర్మంబులు సెడకుండఁ గాపాడుట రెండవవిషయము. ఇతరవిషయములన్నియు నిందుదహరింపఁబడిన యభిప్రాయద్వయమును నెఱవేర్చుటకుఁ దగుకార్యములుదక్క వేరొండు గాఁగూడదు:—ఇట్టి మహదాశయముతో పైనుదహరింపఁబడిన నాలుగు మఠములును భారతభూమియందు మహమ్మదీయ పరిపాలనము స్థిరతవహించువఱకు నకలంకముగ వైదికధర్మ పరిపాలనము గావించినవి. అందు శృంగగిరిపీఠము మహదతిశయమునుఁగనుటచే నాస్థలగౌరవము నేటివఱకును దిగంత విశ్రాంతకీర్తిని వహించియున్నదని యెల్లఱకునుఁ దెలిసినవిషయమే. శృంగగిరియందుఁ బ్రతిష్ఠింపఁబడిన పీఠము ప్రతాప భారతీపీఠమను పేరఁ బరగుచున్నదని వేణుకాతంత్రమువలనఁ దెలియవచ్చుచున్నయది, "పురామండనమిశ్రాఖ్యం ద్విజం బ్రహ్మాంశసంభవమ్ । శాస్త్రవాదైర్వినిర్జిత్య సన్యాసంస్థాప్యభూతలే । తత్పత్నీం సరసాంవాణీం భారత్యంశసముద్భవామ్ । వనదుర్గామహామంత్ర బలావాక్ప్రస్థభూతలే । శ్రీమచ్ఛృంగగిరిక్షేత్రే పురావాణ్యాపవిత్రితే । తుంగభద్రాతీరగతే శంకరో యతిశేఖరః । ఆకల్పంస్థాపయామాస స్థిరాభవఇతీరయన్ । ప్రతాపభారతీపీఠం యోగపీఠంచతద్భవేత్" ॥ ఇతి॥

ఇఁక మహమ్మదీయప్రభుత్వము భారతభూమియందు స్థిరతగాంచగ దేశీయప్రభువులకు శక్తిలోపంబులు గలుగుటయు పీఠాధిపుల శాసనానుకూలముగ పరిపా

లించుటకు మహమ్మదీయులు పేక్ష సేయుటకు మారుగ విఘాతమునుఁ గలుగఁజేయువారలగుటచేఁ బీఠంబులు గొంతవఱకు బలమును గోలుపోయినవి. అట్టితరుణమున శాంకరశకము ౧౨౮౦ వ వత్సరమున విద్యారణ్యులనుఁ బ్రసిద్ధిగాంచిన మహనీయులు శృంగగిరి పీఠమున కభిషిక్తము సేయఁబడిరి. విద్యారణ్యులనునది వీరికిఁ బౌరుష నామము. దీక్షానామము శ్రీవిద్యాశంకరులు వీర లపరశంకరుఁ డనియే సకల విబుధ జనాభిప్రాయము. వీరలు ౧౨౮౫ వ వత్సరమునఁ దుంగభద్రాతీరమున శ్రీవిరూపాక్ష క్షేత్రమున శ్రీవిద్యానగరమునుఁ బ్రతిష్ఠించి యచట బుక్కగోపాలుని భూపాలునిగఁ బట్టభద్రునిఁజేసి యాతనిచే వైదికధర్మమునుఁ బరిపాలింపఁజేయుటకుఁ గాను రేణుకాదేవి యాజ్ఞాప్రకారము విరూపాక్ష క్షేత్రమున నొకపీఠమును నిర్మించిరి.

అద్దానిఁగూర్చి రేణుకాతంత్రమిట్లుఁ బ్రశంసింపుచున్నది.— "ప్రతాపభారతీ పీఠం నిర్మాయయతిశేఖర। విరూపాక్షప్రదేశేఽస్మిన్ కురుష్వమదాజ్ఞయా! శృంగేరీ భట్టవిప్రేంద్రం రేణుకాం స్థాపయాద్య చ।ప్రతాపభారతీపీఠం యోగపీఠంచ భాసురం। శృంగేరీభట్టవిప్రేంద్రో నిత్యం రక్షతి వైధ్రువమ్". ఇతి॥ అన్యచ్చతత్రైవ॥— "ఉపాయంత వపక్ష్యావః తథాకురుమహామతే! అస్మిన్కలి యుగేఘోరేప్రాప్తే బ్రాహ్మణాభిన్న మార్గగాః। శ్రుత్యాచారంపరిత్యజ్య మిథ్యాచారం సమాశ్రితాః। నానామతా నాస్తికాశ్చపాషండా శ్రుతిభేదకాః। అతస్తేషాంతు రక్షార్థం బ్రాహ్మణ్యస్థాపనాయచ।పీఠంకురుమహాబుద్ధే సప్తసోపానమండితం।మూలాధారసహస్రారపర్యంతాఖ్యం కురూత్తమమ్! మూలాధారేమహాదేవీం త్రిపురాంచనివేశయ। స్వాధిష్ఠానేగురూంత్సర్వాంత్సశిష్యాంత్సన్నివేశయ। మణిపూరేగణపతీ నష్టౌతాన్సన్నివేశయ॥ అనాహతేహరేర్భేదా నవతారాన్నివేశయ। విశుద్ధాఖ్యే మహాచక్రే సూర్యాద్వా దశవేశయా। ఆజ్ఞాచక్రేమాతృకాణాం గణంతస్మిన్నివేశయ। సహస్రారేచంద్రమౌళించ తస్మిన్సన్నివేశయ। నిర్మాయైవంపీఠరాజ్యం తస్యపూజాం సదాకురు"— ఇతి॥— కించాన్యత్॥— "మచ్చక్రమండితం పీఠమాచార్య త్వాయకల్పితం। యాతేరన్యోనాధితిష్ఠేన్న చాప్యారాధయేత్స్వత। అనుశాధిగురోః పీఠేయతేఽవాధికార్యతామ్। యతిస్తేసంప్రదాయస్థః ప్రాప్నుయా న్నాన్యమస్కరీ" తేసంప్రదాయస్థః అనుచో భారతీ సాంప్రదాయస్థుడని యర్థము॥—

శ్రీవిద్యాశంకర భగవత్పాద ప్రతిష్ఠితంబైన ప్రతాపభారతీ పీఠమును సుస్థిరంబుగ

నుండ మఱల విరూపాక్ష క్షేత్రమున మఱియొక భారతీపీఠము నేలఁబ్రతిష్ఠింపవలయు ననిన నిందొక ధర్మసూక్ష్మముగలదు. పీఠసన్నిధియందుదక్క వేరొక స్థలమున నెట్టికార్యమును లౌకికముగాని వైదికముగాని యాచరింపఁగూడదు. శృంగగిరి యందలి పీఠము ధ్రువపీఠము. అక్కడ పీఠాధిపతులు స్థిరముగ నిలిచియుండి యితర స్థలములందలి కార్యములను శిష్యులద్వారా చేయించుచుండెడివారలు. విద్యారణ్యు లన్ననో శృంగగిరియందుండుటకు వీలులేక పోవుటచేతను విరూపాక్షముననే యుండ వలసి వచ్చుటచేతను గార్యావసరములచే నిటునటుఁ బర్యటనముసేసి కార్యనిర్వాహకము సేయవలసివచ్చుటచేతను సందుల కుపయుక్తమగునటులఁ జరపీఠము నొక దాని విరూపాక్ష క్షేత్రమున నిర్మింపవలసిన కారణము గల్గెనని ప్రాజ్ఞులు గ్రహింపఁ గలరు. శ్రీవిద్యానగరము రాజధానియగుటచే శ్రీవిరూపాక్ష పీఠస్థులు మహా రాజ గురువులుగ నుండవలసివచ్చుటచే శృంగగిరి పీఠాధ్యక్షులగు శ్రీవిద్యారణ్యులు విరూపాక్షమునకుఁ దమ రాజధానిని మార్చుకొనుటచేతను శృంగగిరియందలి కార్య ములను దమ శిష్యుఁడగు చంద్రశేఖర భారతిచే జరపించుటచేతను నాటంగోలె విరూ పాక్షము ముఖ్యపీఠముగను శృంగగిరి యుపపీఠముగను సలరారుచుండెను.

ఇదిట్లుండ నీవిరూపాక్ష పీఠప్రతిష్ఠనుగూర్చియు శ్రీవిద్యానగర ప్రతిష్ఠను గూర్చియు నొక యద్భుతవిశేషము సాంప్రదాయాను ప్రాణితమై పరగుచున్నయది. అదెట్టిదనః—శ్రీవిద్యారణ్యులవారు శ్రీవిద్యానగరపు శంకుస్థాపనమునకును దమ పీఠాధీశ్వరియొక్క శ్రీచక్రరాజమునుఁ బోతఁబోయుటకు నొకయుషఃకాలమున నన బ్రాహ్మీముహూర్తమున ముహూర్తము నిశ్చయముసేసి యారెండుకార్యముల నకా లమునఁజేయుటకు శిష్యుల నియోగించి తన్ముహూర్త సూచకంబుగా నొక శంఖధ్వనిసేసెదమని యానతిచ్చిరట. అట్టియానతి ననుసరించి శిష్యులు వేచి యుండ నొకశంఖధ్వని వినవచ్చెనట. వెంటనే శిష్యులు శంకును స్థాపనముసేయు టయు మూసఁబోయుటయుఁ జేసిరట పిమ్మట నొకశంఖధ్వని వినవచ్చెనట. అద్దా నికివగచి శంకునూడ బెఱికి తిరిగి ప్రతిష్ఠనొనరిచిరట. పిమ్మట శ్రీవిద్యారణ్యులవారు గలయగ నీరెండు శంఖధ్వనుల వృత్తాంతమునుఁ దెలుప వారలందులకుఁ గడు విషా దముసెంది మూసనుఁ దెఱచిచూడ శ్రీచక్రరాజమునందలి కూర్మమునందొకింత భాగ ములోహము ప్రసరింపక నిలచియుండెను. శ్రీచక్రరాజమంతయు యథావిధియుక్త

నాగేభసంయుతమై దివ్యతమంబుగ నొప్పుచుండె. ముహూర్తప్రమాదమునకును గూర్మభేదమునకును జాంచల్యమునుఁజెంది ఖిన్నులైయుండ వేదవ్యాస భగవానులు దర్శనమిచ్చి నీయొక్క యాస గలికాల విరుద్ధము. కాలమునకు ననువుగ ముహూర్తము లభించినది. నీయొక్క కార్యముల జరపుటయందు నిరుత్సాహము నెందవలదు. ఈనగరము రెండువందల ముప్పది వత్సరములు మహావైభవమును బొందును. పిమ్మటఖిలము గాఁగలదు. తదనుగుణంబుగ నీపీఠప్రభగూడ తగ్గుచు నొకదివ్యవర్షమునకు నన మూడువందలయరువది మానుషవత్సరములకు దిరుగ వైభవమునుఁ బొందగలదని యాభయమిచ్చి యంతర్ధానమైరట. అంతట ధైర్యము తెచ్చుకొని పీఠనిర్మాణమును గావించి నగరనిర్మాణముసేసి బుక్కగోపాలునా నగరమున భూపాలునిగ బట్టభద్రుగావించిరి. శ్రీవిద్యాస్వరూపము శ్రీ పీఠము. అట్టిపీఠము ప్రధానముగా గల్గిన నగరమగుటచే నగరము శ్రీవిద్యానగరమను సార్థకనామమునుఁ బడసినది. అయ్యాదియు కాలక్రమమున విజయనగరమను వ్యవహారమునుఁబడసి తుంగభద్రాతీరమున నలరారుచుండెడిది. శ్రీవిద్యానగర ప్రతిష్ఠాదివసము మార్గశీర్షపూర్ణిమయని సుప్రసిద్ధవ్యవహారముఁ బరగుచున్నది. ఇయ్యది ప్రసంగాను ప్రసక్తిచే వివరింపఁబడిన విషయము.

శ్రీవిద్యారణ్యులన్నవో విరూపాక్షక్షేత్రమునఁ బీఠ రాజమును బ్రతిష్ఠించి బుక్కభూపాలునిచే ధర్మసమ్మతముగఁ బరిపాలనము సేయించుచు వైదికధర్మమునుఁ జక్కగ నెలకొలిపి శాంకరశకము 1889 వ వత్సరమున విరూపాక్షపీఠమున నప్రతిహత తేజముగల శ్రీనృసింహభారతుల బట్టభద్రు సేసి వైశాఖ శుక్లతృతీయయందు కైలాసమున కేగిరి. పిమ్మట భారతీసాంప్రదాయము విరూపాక్షము, శృంగగిరి యను రెండు పీఠము లాలవాలముగాఁగల్గి యభివృద్ధినెంద నారంభించెను. అందు విరూపాక్ష పీఠాధీశ్వరులగు శ్రీనృసింహభారతులు సకలపీఠ శాసకులగుటచేతను శృంగగిరిపీఠ ముపపీఠముగఁ బరిపాలింపఁబడుటచేతను విరూపాక్ష పీఠాధీశు లుభయపీఠాధిపతులుగ వ్యవహరింపుచుండుటచేతను వీరలకు ఋష్యశృంగపుర వరాధీశ్వర, విరూపాక్షాధీశ్వర యను బిరుదములు వ్యవహారమునుఁ గనుచున్నవి.

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠము:—పైనుదహరింపఁబడిన రెండుపీఠములలో శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠము జగద్గురు పీఠముగ నలరారుటంజేసి యద్దాని చారిత్రము నొకింత మున్ముందు నిరూపించుట యుచితము. శ్రీవిద్యారణ్య విద్యాశంకర

భారతులచే శ్రీనృసింహభారతులు శ్రీపీఠమున నభిషిక్తము సేయఁబడినట్లు వక్కాణింపఁబడియె. వీరలు శ్రీవిద్యారణ్యులకు రెండవవారలు (2) శ్రీనృసింహభారతుల యనంతరము సురేంద్రభారతులు (3) తదనంతరము శంకరభారతులు (4) పిమ్మట నృసింహభారతులు (5) పిమ్మట సచ్చిదానందభారతులు (6) పిమ్మట శంకరభారతులు (7) పిమ్మట విద్యారణ్యభారతులు (8) పిమ్మట నృసింహభారతులు (9) పిమ్మట శంకరభారతులు (10) పిమ్మట సచ్చిదానందభారతులు (11) పిమ్మట విద్యారణ్యభారతులు (12) పిమ్మట శంకరభారతులు (13) పిమ్మట సచ్చిదానందభారతులు (14) పిమ్మట సదానందభారతులు (15) పిమ్మట విద్యాశంకరభారతులు (16) నుఁ గ్రమముగా నీ శ్రీపీఠమునుఁ బరిపాలించిరి. శ్రీవిద్యారణ్య విద్యాశంకరులవారికి బదునాఱవ పురుషులగు నీవిద్యాశంకరభారతులవారి కాలమున శాం॥ శ॥ 2074 (క్రీ. వె. 1565) వ వత్సరమున శ్రీవిద్యానగరము మహమ్మదీయులచేఁ గొల్లపెట్టఁబడి నిర్మూలము గావింపఁబడియె. మహమ్మదీయుల దాడులస్వభావమును గుర్తెంగిన వారలకు శ్రీపీఠాధీశ్వరు లత్తఱుణమునఁ దమ పీఠరాజమును గాపాడుకొనుటకుఁ బడిన శ్రమదమాదు లూహింప నవకాశముండును. ఏదియెట్లయినను పీఠరాజము పవిత్రతనుం బగుటఁజేసి యద్దాని నెట్టులో సంరక్షించుకొని తమ శిష్యులగు నృసింహభారతులను, విద్యానృసింహభారతులను వెంటఁబెట్టుకొని ప్రచ్ఛన్నముగఁ గోటకొండ కొప్పట్రాళ్ళ యను బల్లెనుఁజేరి శ్రీపీఠరాజసేవా తత్పరులగుచు నచ్చట నొక పదిమాసములు గాలమును వెళ్ళించిరి. అట్లుండ నచట శ్రీవిద్యాశంకరభారతులకు నిర్యాణకాల మాసన్నమయ్యెను. అప్పుడు నృసింహభారతులకు (17) శ్రీపీఠాధిపత్యము నప్పగించి విద్యానృసింహభారతులనుఁ బుష్పగిరి మఠమునందుండి సేవాద్రవ్యమును శ్రీపీఠరాజమున కంపునట్లు నియమించి శ్రీవిద్యాశంకరభారతులు నిర్యాణము నొందిరి. పిమ్మట మహమ్మదీయులు సేయవలసిన కృత్యముల నన్నిటినిఁజేసి వెడలిపోవ శ్రీనృసింహభారతులు శ్రీపీఠరాజ సహితంబుగ విరూపాక్షక్షేత్రముం జేరిరి. విద్యానృసింహభారతులు పుష్పగిరిమఠము సేరెను. అప్పటికి పీఠస్థానమగు విరూపాక్షక్షేత్రపుస్థితి భగవంతుడెరుగుగాక! గ్రంథరాజములన్నియును మంటలోను మట్టిలోను గలిసియుండెను. శ్రీపీఠాధీశ్వరులును శ్రీపీఠరాజమును మాత్రము మిగిలియుండినందులకుఁ బ్రాజ్ఞులెంతయు సంతసిలవలయును.

పుష్పగిరిమఠము:—ప్రకృతమునఁ బుష్పగిరిమఠమన నేమియో యొకింత తెలియదగినది. శ్రీవిద్యారణ్యులవారు ధర్మసంగ్రహమునకై యచ్చటచ్చట నుచిత ప్రదేశములందు గొన్ని మఠములఁగట్టి యవ్వానియందుఁ దమకడ నుత్తీర్ణులైనఁ బరమహంస పరివ్రాజకుల నునిచి ధర్మప్రచారము గావింపుచువచ్చిరి. అట్టి మఠములకు దత్సమీపముననుండు ప్రజలవలన స్వీకరింపఁబడు సుంకములలో నియతద్రవ్యము నుపయోగించి శేషించిన ద్రవ్యమును శ్రీపీఠసన్నిధికిఁ బంపునటుల నేర్పాటులఁగావించిరి. ఇయ్యది మఠములయొక్క యార్థికవిషయము. అట్లేర్పరుపఁబడిన మఠములలో నొక్కటి పుష్పగిరిమఠము. శ్రీవిద్యారణ్యులవారి కాలము మొదలు సుమారు నాలుగువందల సంవత్సరములవరకు నెవ్వరో యొక పరమహంస పరివ్రాజకులు శ్రీపీఠసన్నిధినుండి పుష్పగిరిమఠమున కధిపతిగఁ బంపఁబడువాడుక యుండెడిది. ఆతీరుననె శ్రీవిద్యానృసింహభారతులు శ్రీవిద్యారణ్యులవారికిఁ బదునారవ పురుషులగు శ్రీవిద్యాశంకర భారతులచే శా॥ శ 2075 (క్రీ. వె. 1566) వ వత్సరమునఁ బుష్పగిరి మఠమునకు నియమింపఁబడి పంపఁబడెను. ఇట్టియాచారమును ధృవపరచు నిదర్శనములు బెక్కులుగలవు.

విరూపాక్షమున శ్రీనృసింహభారతుల యనంతరము శ్రీవిద్యారణ్య భారతులు (18) శ్రీపీఠమునధిష్ఠించిరి. పిమ్మట విద్యానృసింహభారతులు (19) పిమ్మట సచ్చిదానందభారతులు (20) పిమ్మట శంకరభారతులు (21) పిమ్మట విద్యాభినవ శంకరభారతులు (22) పిమ్మట నుద్దండ నృసింహభారతులు (23) పిమ్మట విద్యాశంకరభారతులు (24) క్రమముగ విరూపాక్ష శ్రీపీఠమునలంకరించిరి. ఈవిద్యాశంకరభారతులకాలమున నొకవిశేషము జరిగెను. అక్కాలమునఁ బుష్పగిరి మఠమున నుండు స్వామి దనయొక్క స్థానబలాతిశయమున నొకింత గర్వమునొంది శ్రీపీఠాధీశ్వరులను ధిక్కరించి సేవాద్రవ్యమునుఁ బంపమానెను. అప్పుడు శ్రీపీఠాధీశ్వరులాతనియొక్క దర్పమునడంచి యాతనివలననొక యొడంబడిక నపేక్షించిరి. అందులకు నప్పుడు పుష్పగిరియందుండిన శ్రీవిద్యానృసింహ భారతులను నాతడు "కడప సుబాలోని చెన్నూరు, కమలాపూరుపరగణా, మామిలాబాదు, కేరల్, మాదూరు నెమ్మల్మడుగు, సిరువేల్, నాందేల్, అత్తంకూరు, భోందా, తంకూరు, ఖమ్నాల్, అలిపూరు, వెంపలిపుల్లి, వెందక, ఖదిరి, రాచవీడు అను పదునారు తాలూకాలును

రాజవారి దేశమును, నెల్లూరు ప్రదేశము అనుస్థలమందు బీరప్రయుక్తాధికారముతో సంచారముచేసికొనుచుఁ బ్రతివత్సరమును శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమునకు నాలుగువేల వరహాలు సెల్లించునట్లును, అట్లు జెల్లింపనినాడు పుష్పగిరిమఠమును శ్రీపీఠములోఁ జేర్చుకొనుటకును శృంగేరీ శ్రీవిరూపాక్షపీఠమునకు సర్వాధికారములు గలిగి యుండునట్లు యొడంబడికను వ్రాసి శాº॥ శ॥ 2161 వ సంవత్సరమగు నందనవత్సరంబున శ్రీపీఠాధీశ్వరులకు సమర్పించి సుఖంబుననుండె—ఈ యొడంబడికకు బొంబాయి హైకోర్టువారు చేసినట్టి యింగ్లీషుతర్జుమా యిట్లుఁ బరగుచున్నది.

Exhibit B in original suit No 127 of 1912.

(Translation of an agreement in Marathi written in the Modi-charenter)

40. Shri Vidyasankar. Seal.

The Names of persons and of places mentioned herein being quite strange to the translator could not be properly deciphered (I L D) P. T. K. Translator.

To Swami Vidya Shankar Bharati, the chief of Sringeri Shri Virupaksha Pitha, this writing is passed by Vidya Nrusimha Bharati the occupant of the Pitha (i. e. the seat of the head Acharya) of Shri Sringeri, Shri Virupaksha, Shri Alipur (and) Shri Pushpagiri who passes this writing as follows:—On the 7th of Karteek Shud in the Cyclical Year Nandana (i. e. 30th October 1832) in the presence of Takudpant Asenar Deshpande (and) Gumastah Bhalapa Shankarpant, a dispute having arisen between you and me I have considered (acepted) you as my Guru Pitha (lit: in the place of my Guru) I asked you as to my going on a tour over the country. As to that you decided (to allow me to go on tours) in (the following) places namely, in Chennoor in the Subha of Kadapa, Kamalapur pargana Mamilabad veral, Mudur, Nemalmadugu, Siruval, Nandel, Attamkur, Bhonda, Tamkur Khadnul, Alepur, Vempalipuli, Vendak, Khadri and Rachved— in these 16 Taluqs and in the country of Rajuvari Desh (and) in the country of Nellore. I am to go on tour in so many countries as above and make an inquiry into the religious observances and conduct of the people at those places and that if I should make a tour in the above mentioned 16 Talukas and the two countries (mentioned above) I am to pay to you per cyclical year 4 four thousand Shivrai Hons (a gold coin worth rupees four) and make an inquiry into the conduct

of the people of the said countries. If as agreed to above I should not pay moneys, I am to restore you possession of the whole of your country. Here after there is no dispute left between you and me. The agreement is thus entered into 1 (One copy) of this document is kept with Bharati Subba Sastri, one with Petnagi Narsambattu Rachkonda Rama Sastry and one with Tadakagrahar Geripedi, Venkata Joshi and one with Nendal parwat Shastri. In this manner this document is given in writing. Therefore I shall live by making (my) tours through the above mentioned places agreebly to your orders. I pass this document in writing as above.

**Such is the 'Narayana Smriti'**

This is the mode of signature generally adopted by Sanyasins 'Narayan Smriti' literally means 'Remembrance of the deity 'Narayan'

Attestations.(Here follow signatures of attestors in Telugu). Attestation of Rama Shastry an inhabitant of Kodur. In the presence of all the persons present this document is written by Subrao Gumasta of Balappa Shankarpant

Seal:— A true translation. (Sd) P. T. Koppikar.

*Translator, High Court Bombay.*

(True Copy)

(Sd) R. VEERANUKAYYA.

*Supdt.*

శ్రీవిద్యాశంకరభారతుల యనంతరము శ్రీనృసింహభారతులు (25) విరూపాక్షపీఠము నలంకరించెను. పిమ్మట విద్యారణ్యభారతులు (26) పిమ్మట నుద్దండ శంకరభారతులు (27) పిమ్మట నృసింహభారతులు (28) పిమ్మట శాం॥ శ॥ 2274 వ వత్సరమున నభినవశంకరభారతులు (29) పిమ్మట నుద్దండ నృసింహభారతులు (30) పిమ్మట విద్యారణ్యభారతులు (31) నుఁ గ్రమముగా విరూపాక్షపీఠము నలంకరించిరి. శ్రీవిద్యారణ్యులవారికి ముప్పదియొకటవ పురుషుడగు శ్రీవిద్యారణ్యభారతులు శాం॥ శ॥ 2303 వ వత్సరమున నుద్దండభారతుల (32) శ్రీపీఠమున కభిషిక్తముసేసి విరమించెను. ఇంతవరకును శ్రీవిరూపాక్ష పీఠాధీశ్వరు లప్రతిహత తేజంబుతో నకలంకముగ శృంగేరీపీఠము, పుష్పగిరిమఠముఁ దమ్ము జగద్గురుపీఠముగఁ గొల్చుచుండ జగద్గురుత్వ సామ్రాజ్యముతో నొప్పుచుండెడివారలు. ఇట్టి తరుణమునఁ బుష్పగిరిపీఠము ననుకరింపుచుఁ గొన్ని కృత్రిమపీఠములు పరివ్రాజక బ్రువులునుఁ బొట్టకూటిదాసులగు శాపదగ్ధ బ్రాహ్మణాధములునుఁ బ్రధానముగాఁగల్గి బయలు వెడలి

నవి. అద్దానిచేఁ బ్రజలకు నొత్తిడిగలుగుట యటుండ సన్యాస సాంప్రదాయములకు ననర్థములుగలిగి ధర్మవిప్లవము గలుగ నారంభించెను.

శ్రీపీఠచలనము:—శ్రీవిద్యారణ్యులవారు శ్రీపీఠమును విరూపాక్షక్షేత్రమునఁ బ్రతిష్ఠించినది మొదలు ఉద్దండభారతులు శ్రీపీఠమున కభిషిక్తము సేయఁబడువరకును సర్వవిధముల నీపీఠము విరూపాక్షక్షేత్రమునందే యుండి యధికారమునుఁ జేయుచు వచ్చెను. ప్రకృతపు పరిస్థితులనుఁబట్టి కృత్రిమపీఠముల దుర్మార్గముల నడంచి ధర్మ సంస్థాపనము సేయ సమకట్టి యుద్దండభారతులు స్వయముగ దిగ్విజయము సేయ సమకట్టి శ్రీపీఠముతోఁగూడ దక్షిణదేశమునకుఁ బయలువెడలిరి. ఇట్లుద్దండభారతులు దక్షిణదేశమున నుండుతరి విశ్రాంతి నొందియుండిన శ్రీవిద్యారణ్యభారతులు విరూపాక్షక్షేత్రమున సిద్ధిబొందిరి. అట్టితరి నచటనుండు బ్రాహ్మణాధములు గొందఱు శ్రీపీఠద్రవ్యమునకును అధికారమునకును నాసఁజెంది యొకబ్రహ్మచారికి ముండనము సేయించి కాషాయంబుల గట్టించి యావృద్ధస్వాములవారే యాతనికి సన్యాసమిప్పించి పీఠప్రయుక్తాధికారమిచ్చిరని సత్యేతర ప్రసంగములఁ జాటుచు మఠము నాక్రమించుకొని యధికారమును సాగింప మొదలు వెట్టిరి. ఏతద్విషయమంతయు విరూపాక్షప్రాంతమునం గల విబుధలోకముచే నుద్దండభారతులకుఁ దెలియపరచఁబడెను. అప్పటికి నుద్దండభారతులు కుంభకోణప్రాంతమున దిగ్విజయము సేయుచున్నటులఁ దెలియవచ్చెడిని. పిమ్మట నుద్దండభారతులు దక్షిణదేశమునందలి దుండగముల వారించి శృంగగిరిపీఠమువారిని స్వతంత్రముగ వ్యవహరింప దేశవిభాగము సేసి యధికారమిచ్చి విరూపాక్షమునకు జేరువఱకు రెండు సంవత్సరములాయెను. విరూపాక్షమునకు వచ్చినతోడనే మఠద్రోహులగు నాకృత్రిమ పరివ్రాజకుని వాని యనుచరులను మఠమునుండి వెడలగొట్టిరి. పిమ్మట నచటనుండు విబుధలోకము చేతను రగోబాపీష్యాగారి ప్రతినిధిచేతను బ్రార్థింపఁబడి పిమ్మట యాకృత్రిమసన్యాసిని బ్రాహ్మణులను బీఠప్రయుక్తాధికారము లేకుండ నైజామురాష్ట్రమునందలి తెలాంగనాయందు సంచారము సేసి పొట్టపోషించుకొనను నట్లానతిచ్చిరి. ఏతద్విషయమంతయు నుద్దండభారతులచే తుల్జాపూరు సభాపతికి వ్రాయించఁబడిన శ్రీముఖము వలన సువ్యక్తమగుచున్నయది. అద్దాని నిచటఁ బొందుపరచుచున్నారము.

Exhibit I D in Os. No. 127 of 1912 (Translation of a Marathi letter written in the Modi charecter)

Sri Vidyasankar. Seal of the swami of Shringeri (In Hindustan corresponding with the 11th of Bahman in the Fasli year 1322 (i. e. A. D. 1913) Plaintiff:-Sachidanand Swami Versus Defendant Bodhanand Swami produced by Balachandra alias Bapu. That is all. Nazim. Zilla Adalat.

From † Shankar Bharati Swami, disciple of + Vidyaranya Bharati Swami. To our dear disciples at a sacred place of Tuljapur, (Viz) all learned men, officers, land lords, Patils, Kulkarnis, Joshis and all such other persons to whom with blessings that would endure for all time this letter is in the name of God written as follows. On the 10th of Bhadrapad Shudh in the cyclical year Kalyukta (ie. 17 th September 1858) from the place Lavhara where I have been residing in full delight being devoted to the worship of the Shri (ie. the diety). Previously I, having finished the Chathurmasya (The four months of the monsoon) at the Shri Kshetra (Sacred place) in the cyclical year Anand (ie. A. D. 1854) and having taken a Vinanti Patra (a letter of request from you all according to Sampradaya (practice or usage) left the place on tour and then went to Miraj and thereafter to the southern country, and then having travelled through the countries of Vidarbhas, Kalinga (s) and such countries as the Andhras, Chol, Malyal and Pandya and Kera and other Dravid countries and having punished at those various places the Telangs disguised as Sanyasins and having obtained occasionally at different places Jayapatras at oral debates and having obtained worship accompanied by all honors at such capitals as Chandavar and at holy places such as Kanchi, Chidambar (and) Kumbhakonam I, now returned to the country. In the Meantime His Holiness had departed this world. At that time, some belly-pampering Telangs who were near him a short time after the demise of His Holiness, put forward a Telanga pretender who went about from place to place devastating the property of the Math. The Swari (a term of respect applied to a great personage) came after two years; afterwards, Bathi (This word Bathi is unintelligible. This word can also be read as Hathi, in which case it would mean 'Elephant') and other articles so many of them as could be found were taken. Then many people requested that some way might be suggested to him thereupon he was given some articles and he was directed that he should tour in some Parganas in the Telangan Country and that he should live there and that he should not come in the Maharashtra Country and that he should not have any authority in respect of the Pitha (ie. the Gadi of the head Acharya) Having obtained papers and documents as above and having there-under put under control each paragana the Swari came via Khed Manoor, Surpur, Aukalkot, Aland Gunjoti and other places. The Swari will be going to the town.

---

† The portion indicated by asterisks contains the several honorific titles of the swami of Shringeri.

The object of coming here is to pay a visit to the deity. By way of previous intimation, fruits, rice grains (beasmeared with kumkum powder etc) are sent (to you). Do you therefore be prepared to meet (the Swari) accompanied by all people. Further, if any persons at your several places are privy to the Telanga inwardly, that matter will be set at rest personally. Do you keep in readiness lodgings etc., for the retinue and for the worship of the deity. What more needs be written. Such is the 'Narayan Smriti' (This is the mode of signature generally adopted by Sanyasis, 'Narayan Smriti' literally means "Remembrance of the deity Narayan" Seal. A true translation (Sd) P. T. Koppikar, Translator, High Court. Bombay (True Copy) 4th and last sheet. R. Veeranukayya, Supdt.

పై శ్రీముఖమువలన శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠమున కెంత రాష్ట్రముపై నెట్టి యధికారము వ్యవహారమందుండెడినో ప్రాజ్ఞులు గ్రహింపగలరు. అంతియె కాదు. ఉద్దండభారతుల కాలమునం దెట్లుం గొందఱు బ్రాహ్మణాధములు ద్రవ్యాశచే నెంత దుర్మార్గమునకుం గడంగి యొక బ్రాహ్మణునికిం బరివ్రాజక వేషము వేయించి పొట్టంబోసికొన నెంత విశ్వప్రయత్నములు సేయుచుండిరో యదియుం గూడ సువ్యక్తమగుచున్నది. ఇంతియ కాదు. దక్షిణదేశమునం దత్కాలమున నెట్లుం గొన్ని కృత్రిమపీఠములు వెడలెనో యా తెరంగుం గూడ సువ్యక్తమయ్యెడిని. ప్రకృతమున సుప్రసిద్ధ వ్యవహారమునం గనుచున్న కుంభకోణమఠమునకుగాని, ఆమని శివగంగలోనుగాగల మఠములకుగాని, యత్కాలంబున నెట్టియూరును బేరునుం గూడ వినవచ్చినట్లుం దెలియరాదు. ఇందుమిందుగా నీకాలమే భారతభూమియందు కృత్రిమ పీఠములు బయలు వెడలిన కాలమని నిస్సందేహముగం జెప్పనగును.

ఇయ్యది ప్రసంగానుప్రసక్తిగ నిరూపింపంబడిన విషయము.

అంతనుద్దండ భారతులచేం గనికరపురస్సరంబుగం దెలాంగానాయందుం బొట్టం బోసికొన నవకాశమీయంబడిన దుండగీడులంతట నొక కృత్రిమపీఠమునుం గల్పించుకొని యా సన్న్యాసిని ముందుం బెట్టుకొని తెలాంగానాయందు నిజేచ్ఛ వ్యవహరింపుటయే కాక జగద్గురు పీఠమును నిర్మూలము సేయ నానోపాయంబులకుం గడంగిరి.

☞ నాటంగోలె నీకృత్రిమపీఠము హంపిపీఠమనియు హంపివిరూపాక్ష పీఠమనియు నొక కృత్రిమ నామంబుతో దిరుగ నారంభించి నేటికిని నైజాము రాష్ట్రమున నట్టిదుష్టస్థితులతోడనే నిలచియున్నది.

ఇదియిట్లుండఁ బ్రాగ్దేశమున ననుత్తరసర్కారులందును మహారాష్ట్రదేశమునందునుఁ గలవరములు బయలువెడలినవి. అవ్వాని వారించుటకు నుద్దండభారతులు మహారాష్ట్రదేశమున దిగ్విజయము సలిపి ప్రాగ్దేశమున యాత్రసేయుచుండెను. అట్టి తరుణమునఁ గృత్రిమపీఠనవర్తకులకు సంబంధించిన విరూపాక్షశాస్త్రియను నొక బ్రాహ్మణుడుద్దండభారతుల సన్నిధినిఁజేరి తన నిజస్వరూప స్వభావంబులఁ గప్పిపుచ్చి శ్రీకాకొలువునఁజేరిన కొలదిరోజులలో నుద్దండభారతులకు మంత్రియయ్యెను. పిమ్మట దనకిష్టులగుఁ దొమ్మండుగురు బ్రాహ్మణుల శ్రీపీఠసన్నిధి గ్రమక్రమముగఁ బరిచారకులుగఁజేర్చి తనకార్యక్రమమును సాగింపనారంభించెను. అదెట్లనిన:— తెలాంగానాలో సంచారముసేసికొనుటకు ననుజ్ఞ నీయఁబడిన కృత్రిమసన్యాసి నియమోల్లంఘనముసేసి చరింపుచున్నాడనియు నద్దాని పీఠ్యాగారితోఁజెప్పి మాన్పింపక పోయినచో నెక్కుడనర్థములువాటిల్లుననియుఁజెప్ప నట్టితరి నుద్దండ భారతులు గడువృద్ధులగుటచేఁ బర్యటనాదికము సేయజాలమి తమశిష్యులలో నుద్దండ నృసింహభారతులను వారిపరముగఁ గావలసిన పత్రముల నన్నిటినిచ్చి విరూపాక్షశాస్త్రిని సాయమిచ్చి పూనాపట్టణమునుఁగూర్చి పంపించిరి. పిమ్మట నుద్దండభారతులు బందరుపురముసేరిరి. విరూపాక్షశాస్త్రియు నియమింపఁబడిన స్వాములవారును బెజవాడ పురముసేరి కాలయాపనముసేయుచుండిరి. ఇంతలో నుద్దండ భారతులు బందరుపురమున సిద్ధిబొందిరి. ఆవార్తను వినినతోడనే విరూపాక్షశాస్త్రియు నుద్దండ నృసింహభారతులును బందరుపురమునకు బోయిరి. పిమ్మట నుద్దండ నృసింహభారతులు శ్రీపీఠాధీశ్వరులుగ (33) విరూపాక్షశాస్త్రిచేఁ బ్రేరేపణసేయఁబడి యభిషిక్తముసేయఁబడెను. (33) బందరుపురమునకు సమీపముననున్న శివగంగయను ప్రదేశమున నేటికి నుద్దండభారతుల సమాధి నిలచియున్నది. అట్లుద్దండనృసింహభారతులఁ బట్టభద్రులగావించి విరూపాక్షశాస్త్రి యెప్పటియట్ల మంత్రిపదముననిలచియుండెను. అట్లు విరూపాక్షశాస్త్రి వీరలకడ రెండు సంవత్సరముల మూడుమాసముల పదునైదు దినములు మంత్రిపదమున నిలచియుండె. కాని యాకాలమంతయు శ్రీపీఠాధీశ్వరులువ్యాధిచేఁబీడితులై యవసానకాలమునఁ దమయంతేవాసియగు నభినవ శంకరభారతులకు (34) పీఠమునప్పగించి సిద్ధిఁబొందిరి. ఈయభినవ శంకరభారతీస్వాములవారు విరూపాక్షశాస్త్రియొక్క స్వరూపస్వభావముల బాగుగగుర్తె

రింగినవారలగుటచేఁ బీఠవ్యవహారముల జాగరూకతతోఁ బరిపాలింప మొదలిడి యందుఁ దొలుదొలుత నుద్దండభారతులవలనఁ దమగురుస్వాములవారు గ్రహించిన పత్రములఁ జూడగోరి విరూపాక్షశాస్త్రిని ప్రశ్నింప నాతడాపత్రముల నెఱుంగనని యెను. ఆపత్రములలో ముఖ్యములు:—౧ బుక్కభూపాలునిచే శ్రీవిద్యారణ్యులవారికీయఁబడిన బహుమానపత్రము. ౨ పుష్పగిరి పీఠస్థులు వ్రాసియిచ్చిన యొడంబడిక పత్రము. ౩ తెలంగానా కృత్రిమసన్యాసి వ్రాసియిచ్చిన వినయపత్రిక. అందులకు శ్రీవారాగ్రహముఁజెంది విరూపాక్షశాస్త్రిని యుద్యోగమునుండి తొలగించిరి. అందులకాతడుగనలి తానుబోవుచుఁ దనకుఁదోడుగ మరితొమ్మండ్రుగురిని పీఠపరివారమునుండి లేవదీసికొనిపోయి శ్రీవారిపై యాకాలమున సంచారము చేయుచుండిన న్యాయస్థానమున వ్యాజ్యము నేసెను. వ్యాజ్యవిషయమేమన:—సిద్ధిపొందినస్వాముల వారికిఁ బీఠమిప్పించినచో వారలుదనకు నిచ్చెదమని వ్రాసియిచ్చిన నూటయిరువదియైదు వరహాలున్ను, సిద్ధిపొందిన స్వాములవారికాలమునఁ దనతోఁగలసి పదిమందికి నీయవలసిన జీతములు నిప్పించవలయునని. తనపీఠమునకు సంబంధించిన దస్తావేజులన్నిటినిచ్చినచో జీతములిచ్చుటకు నభ్యంతరము లేదని స్వాములవారివాదము. ఈవాదప్రతివాదములు న్యాయస్థానమున విచారింపఁబడినవి. నౌకరులు దమనౌకరినిఁ జేసియున్నందున వారివారిజీతములువారలకు నీయవలయుననియు, అక్రమపు కార్యములకు బహుమతులిచ్చెదమను యొడంబడిక యక్రమమగుటచే నట్టి బహుమతులియ్య నక్కరలేదనియును, విరూపాక్షశాస్త్రి యాదస్తావేజుల నపహరించినట్లు సాక్ష్యము లేక ఋజువుకానందున నందులకాతడు బాధ్యుడుగాడనియునుఁ దీర్మానము సేయఁబడెను. ఆవిరూపాక్షశాస్త్రియు నతని యనుచరులునుఁ దమకు రావలసిన పైకమును స్వాములవారికడనుండి దీసికొని యెచ్చటికిఁబోయిరో తెలియరాదు. పత్రములేమాయెనో యంతకంటెనుఁ దెలియలేదు. గాని యవి యెచ్చటికిఁజేరును? విరూపాక్షశాస్త్రి యెటనుండివచ్చెనో యచటికేచేరెననుటలో నందియమెంతమాత్రమును లేదు. విరూపాక్షశాస్త్రినిఁబంపిన హంపిపీఠమనుకృత్రిమపీఠముదగ్గరకుఁజేరెను, ఆపత్రముల నచ్చటనే చేర్చెను. అయ్యవి యిప్పటికి నాకృత్రిమ పీఠముకడనే యున్నవి.

శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠమప్పటినుండియు నుత్తరసర్కారులలోన సంచరింపుచువచ్చెను. ఇదియ శ్రీపీఠాతిశయాభిభవకాల ప్రారంభము. అనంతరము

శాం॥ శ॥ 2333 క్రీ. వె. 1824వ వత్సరమున నభినవోద్దండ నృసింహభారతులు(35( విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరపురమున సిద్ధిపొందిరి. వీరియొక్క సమాధి నేటివఱకు నక్కడ నిలచియున్నది. అప్పటికి వారిశిష్యులగు నభినవోద్దండ బోధానంద విద్యాశంకరభారతులనువారు గోదావరిజిల్లాలోనుండిరి. గురువుల నిర్యాణానంతరము శ్రీపీఠము విశాఖపట్టణపు కలక్టరుగారి యుత్తరవుప్రకారము విజయనగరపు పోలీసువారి యధీనముననుండెనని తెలిసికొని విశాఖపట్టణపు కలక్టరుగారిని గలిసికొన వారలాపీఠమును వీరలకప్పగింతపెట్టవలయునని పోలీసు హెడ్‌కాన్‌స్టేబిలునకు నుత్తరవుసేయ శ్రీపీఠముస్వాములవారి యధీనముసేయఁబడి విజయనగర సంస్థానాధీశులగు శ్రీనారాయణ గజపతిరాజు మహారాజావారి పురస్సరముగ విద్వజ్జన మహాజనులచే స్వాములవారు పీఠమునందభిషిక్తముసేయఁబడిరి. విశాఖపట్నంజిల్లా మేజస్ట్రేటువారి యుత్తరవుపత్ర మిచట పొందికసేయఁబడుచున్నది.

Sealed విశాఖపట్నంజిల్లా మేజస్ట్రేటువారి ముద్ర—మహారాజశ్రీ రాబర్టు బమూర్డు యిస్క్వయరు విశాఖపట్నంజిల్లా కలక్టరు అండ్ మేజస్ట్రేటుదొరగారు.

శ్రీవిరూపాక్షం బోధానంద విద్యాశంకరాచార్యుల స్వాములవారికి వ్రాయించిన వుత్తరం. యీనెల ది ౭ తారీఖున మీరు వ్రాసిపంపించిన అర్జీ ప్రవేశమైనది. శిద్ధినొందిన శంకరాచార్యని (చిరిగినది) రితా॥ వున్న దేవతార్చన సామగ్రిన్ని సామానుతా॥ ఖరిదిద్రవ్యమున్ను మీకు యిప్పించడంకు అంగీకరించడమయినది. దేవతార్చన సరంజాం మీకు అప్పగింతపెట్టి రసీదుపుచ్చుకునేలాగ్ను విజయనగరం టవునుపోలయిను గోడే తమ్మయ్యకున్ను సరంజాం అమ్మకంతాలూకు చేరిన రొఖము ద్రవ్యం మీకు యిచ్చేలాగున రాచాబత్తుల రామయ్యకున్ను హుకుములు జారీచేయించడమయినది. గనుక మీరు దేవతార్చనసామానున్ను సరంజాం ఖరిదితా॥ పయికమున్ను మీరు సదరు ఆసామీలవల్ల పుచ్చుకుని అందుకువాల్లకు రశీదులు యిప్పించవలెను. వాల్తేరు మేజస్ట్రేటు అఫీసు. ది ౭ యేప్రిల్ ౧౮౨౪ సం॥ పార్థివ సం॥ చయిత్ర బ॥ ౪ గురువారం స్న ౧౨౩౪ ఫసలీ.

(Signed) Illegible. చిరిగినది (Sd) Illegible. O. S. 127/12 నెం॥24కు 31—7—12. Sealed District Munsiff Court, Rajahmandry. Received 31 July 1912. True Copy. Sd. R. Veeranukayya. Supdt.

అభినవోద్దండ బోధానంద విద్యాశంకర భారతులవారిచే నృసింహాశంకర భారతులు (36) శ్రీపీఠమునం దభిషిక్తము సేయఁబడిరి. వీరలకు నుద్దండ శంకరులు, సచ్చిదానందులు, బోధానందులు, అభినవశంకర భారతులను నలువురు శిష్యులు. అభినవశంకరభారతులు శ్రీపీఠమునం దభిషిక్తము సేయఁబడిరి. (37) వీరలకు సచ్చిదానంద భారతులు, నృశింహాశంకర భారతులను శిష్యులిద్దరుండిరి. అందు సచ్చిదానందభారతులు జ్యేష్ఠులుగాన శ్రీపీఠమునందుఁ గనిష్ఠులగు నృసింహాశంకర భారతుల (38) నభిషిక్తముసేసి విజయనగరమున సిద్ధిపొందిరి. వీరియొక్క సమాధి నేటికిని విజయనగర పురమునఁ జూడనగును. పిమ్మట నృసింహాశంకరభారతులు విద్యాశంకర నృసింహభారతులను (39) శ్రీపీఠమునం దభిషిక్తముసేసి విజయనగర పురాధీశులవలన శాశ్వత భిక్షాకట్నమును గ్రహింపుచు విశ్రాంతిచెందిరి. విద్యాశంకర నృసింహభారతులకు నభినవోద్దండభారతులనుఁ బౌరుషనామముగూడ వ్యవహారము నఁ గనుచున్నయది. ఏలనన వీరికాలమున వితంతూద్వాహ ప్రచారము బయలు వెడల నట్టి తరుణమునఁ దత్ప్రచారకుల శాం॥ శ॥ 2390. క్రీ. వె. 1881 సంవత్సరమునఁ గొందరి శాశ్వతముగనుఁ గొందరిఁ దాత్కాలికంబుగను బహిష్కారము గావించిరి అందులో నొకడగు నాత్మూరి లక్ష్మీనరసింహమనుఁగోమటి శ్రీవారిపై రాజమండ్రి కలక్టరుగారివద్ద నభియోగమునుఁజేయ నద్దానిని కలక్టరుగారు విచారించి పీఠాధికారులకు నట్టి యధికారముండుటను గుర్తెరింగి యా యభియోగమునుఁ ద్రోసివేసిరి. పిమ్మట నాయభియోగము తిరుగ మదరాసుహైకోర్టులో నిద్దరు న్యాయాధిపతులచే విచారింపఁబడి శ్రీపీఠమునకుఁగల బహిష్కార శాసనాధికారాదికమంతయు నిర్ణయింపఁబడెను. కాని యీ తీర్మానమున మూడు విశేష చమత్కారములు గననగును, ౧ శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠమను పేరునకు మారుగ నభినవ విరూపాక్షమను నామాంతర మారోపణము సేయఁబడెను. ౨ ఈ పీఠమునకు నుత్తరసర్కారులందు శాసనాధికారమని యుదహరింపఁబడినది. 3 ఈ పీఠము స్మార్తసంఘమునకుఁజేరిన నారుమఠములలో నొక్కటియని యుదహరింపఁబడియున్నది. ఈ మూడు విశేషములు న్యాయాధిపతులచే నేకారణముచే నుదహరింపఁబడినవో యట్టి కారణములు దెలియరావు. మిగిలిన యైదు మఠములెవ్వియో యెఱుంగుటకుఁగూడ నవకాశము చాలకున్నది. ఏది యెట్లులైననుఁ బీఠ

స్థులుమాత్రము శాసనాధికారముగలవారని నిర్ధారణ సేయఁబడుటచే నెల్లరును సంత షము నెంది మిన్నకుండిరి. శ్రీపీఠ పరిస్థితులు మరుగుపడియుండుటచే నీ మూడు విషయములు యథార్థములని గ్రహింప నవకాశమప్పటికి లేకుండెను. పై నుదహరింపఁబడిన యుద్దండభారతులయొక్క తుల్జాపూరు శ్రీముఖమువలనను ఇంకా యిట్టి పత్రములవలనను పై మూడు విశేషములు సత్యేతరములని ప్రాజ్ఞులెల్లరును దెలిసికొనగలరు. ఏది యెట్లున్నను 6-వ మద్రాసు తీర్పునకును శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠమునకును గల సంబంధమును బ్రదర్శింప నభినవ విరూపాక్షమను నామముగూడ నీ పీఠమునకొక నామముగ నెల్లపుడును స్మృతియందుంచుకొనఁబడవలయును ఇఁక వీరికాలమున నొక విశేషము పుష్కలముగ గమనింపవలసినది యున్నది.—వీరలు 1882 వ వత్సరమున బెజవాడపురమును శ్రీ పీఠముతోఁజేర నచటికి పుష్పగిరి దుర్మార్గులుగూడఁ దమపీఠముతోఁజేరి వీరలఁ బలువిధముల హింసింప మొదలుపెట్టిరి. ఇట్టిదుర్మార్గము లోకవిదితముగాఁగ బందరుపుర వాస్తవ్యులగు విద్వన్మహాజనులు యావన్మందియు శ్రీపీఠమును బందరు పురమునకుఁ గొంపోయి నిజానిజముల లెస్సగ విచారించి యొకవిజ్ఞప్తిని 4-1-1883 వ తేదీని వ్రాసి శ్రీపీఠాధీశ్వరులకు సమర్పించిరి. అందలి విషయమిత్తెఱంగునఁ బరగుచున్నది.

"శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య * * * శ్రీ శృంగగిరి విరూపాక్ష పీఠాధికార శ్రీ మదభినవోద్దండ శ్రీ బోధానంద శంకర భారతీ గురుస్వాములవారు ముఖ్య పూజనీయులనిన్ని పుష్పగిరివారితో మనకు నిమిత్తంలేదనిన్ని మచిలీపట్నం కాపరస్థులయిన అశేషగృహస్థులున్ను సమాఖ్యచేత పెద్ద కోటలో నిశ్చయించుకున్న కాగితము."—౪ వ జనవరి ౧౮౮౩ సం॥ రం॥

పిమ్మట నీయభినవోద్దండబోధానంద భారతీస్వాములవారు వురఫ్ విద్యాశంకర నృసింహభారతీ స్వాములవారు శాం॥ శ॥ 2405 క్రీ. వె. 1896 వ వత్సరమున దమయంతేవాసియగు విద్యానృసింహశంకరభారతీస్వాములవారిని (40) గోదావరి జిల్లా యామలాపుర గ్రామమున శ్రీపీఠమునకుఁ బట్టాభిషేకముసేసి విశ్రాంతిచెందిరి. విద్యానృసింహశంకరభారతీస్వాములవారికాలమున శాం॥ శ॥ 2415 క్రీ. వె. 1906 వత్సరమునఁ జైత్రమాసమున రాజమహేంద్రవరమున దేశిరాజు బాపయ్య, కందుకూరి వీరేశలింగము అను నిద్దరు గవర్నమెంటు కాలేజీ యుపాధ్యాయులు శిఖా

యజ్ఞోపవీతములఁ ద్రెంచికొని బ్రహ్మసమాజప్రవిష్టులైరి. అంత నక్కడి కళాశాల యందలి విద్యార్థులెల్లరును బురజనులలోఁ గొందఱును బైద్వంద్వము ననుక రింప సంసిద్ధులైరి. అద్దానికి నాపురపు విద్వజ్జనమహాజనులు వెఱగుఁజెంది శ్రీపీఠా ధీశ్వరులఁ దమయాపదనుఁదొలగింపఁ బ్రార్థించి తమపురమునకుఁ గొంపోయిరి. శ్రీవారు దమయావచ్ఛక్తిని వినియోగించిరి. కానిప్రయోజనము లేకపోవుటయటుండ నచ్చటి దుండగీడులయొక్క దుర్మార్గముచే శ్రీవారు సన్యాసమందిరమునుండి పాదు కలు సేతఁబట్టుకొని పరుగిడవలసినంత దురవస్థ దటస్థమయ్యెను. అంత శ్రీవారట్టి దుస్థితినుండి ధర్మమునుఁగాపాడ శ్రీబోధానంద భారతీస్వాములవారుదక్క వేరొకరు సమర్థులుగారనియెంచి వారల నచిరకాలములో రాజమహేంద్రవరము రావలసినదిగా విజయనగరమునకుఁ దంతివార్తనంపిరి.

శ్రీబోధానంద భారతీస్వాములవారు:—ప్రకృతమున నీబోధానంద భారతీ స్వాములవారి యోగ్యతావిశేషము నొకింతనిరూపించుట యనవసరముగాదు. కావున నద్దాని నొకింతి నిరూపించుచున్నారము. వీరలకు శ్రీరాజ్ఞీ నృసింహానుహోగ్నిచిత్తసనది పూర్వాశ్రమ నామము. ఉత్తరసర్కారులందు వీరలను రాణీచయనులుగారను వాడుకతో నెఱుంగని పండితపామరులెవ్వరునుండరు. వీరలు పరమపావనమగు హారిత వంశమున జనించినవారు. పూర్వము జయపురాధీశ్వరుడగు జమసింహునిచే నశ్వ మేధయాగమునుఁజేయించిన యుపాధ్యాయులకారవపురుషులు. బ్రహ్మచర్యము వేద శాస్త్రాధ్యయనము సేయుటయేకాక బహుపురాణేతిహాసాగమములఁ బఠించి యందలి తత్త్వమును లెస్సగ గుర్తెరింగినవారలు. గృహస్థాశ్రమమున మహాక్రతువుల నొన రించి యశమునుఁ గైకొన్నవారలు. స్కంధత్రయాత్మకమగు జ్యోతిషమున నకలంక ప్రజ్ఞనుఁబడసి యపూర్వమగు గణితమార్గములఁ బ్రదర్శించి యితరులకశేయమగు పదవి నధిష్ఠించి దైవజ్ఞసార్వభౌమ, సర్వతంత్రస్వతంత్ర యను బిరుదములఁ బరిషణ్మా ధ్యమునసందినవారు. సాంగముగను సరహస్యముగను మంత్రశాస్త్రమునుఁ దెలిసి కొని శుభాగమపంచకానుసరణంబగునట్టియుఁ బరిశుద్ధమగునట్టియు దక్షిణాచారము నాంధ్రదేశమునఁ బ్రవర్తింపఁజేసినవారలు. వీరలకుఁ గల్యాణానందనాథులని శ్రీవిద్యా దీక్షానామము. సాంఖ్యదర్శనమను గ్రంథమును రచించి శ్రీ పీఠాధీశ్వరులవలన "సాంఖ్యాచార్య" యను బిరుదమునుఁ బడసినవారలు. విజయనగర పురాధీశులగు

శ్రీయానందగజపతి మహారాజావారి యాస్థానవిద్వాంసులును. వీరలు ప్రస్థానత్రయ శాంతినిఁగూడఁజేసిన మహనీయులు. వీరలు విశ్వావసు సంవత్సర పుష్యమాసమున సంక్రాంతి దివసములలో (క్రీ. శె, 1906) విజయనగరపురంబున యథావిధి సన్న్యాసంబుసేకొని దండకమండల్వాదుల గ్రహించి విజయనగర సంస్థానాధీశులచే గౌరవింపఁబడుచుండిన శ్రీసచ్చిదానంద భారతీస్వాములవారికడ ప్రణవమహావాక్యోపదేశంబునుఁబొంది శ్రీబోధానంద భారతులను యోగపట్టముచే నభిషిక్తులై తమగురువుల యనుజ్ఞవడసి యథావిధి దండాదులఁ ద్యజించి సుఖంబున నుండెడివారలు. వీరలు శ్రీపీఠాధీశ్వరుల యాహ్వానమునుఁ జేకొనిన దత్క్షణమే పయనమై మఱునటి దివసమునకు రాజమహేంద్రవరము సేరిరి. పిమ్మట శ్రీ పీఠాధీశ్వరుల యాజ్ఞవడసి మహోపన్యాసముల గావించి పదునైదు దివసములలో రాజమహేంద్రవరపుఁగలకలము నుపశమింపఁజేసి ధర్మవిప్లవమురాకుండ గాపాడుటచే మూడవవాడు మరల జందెమును ద్రెంచుటలేదు. పిమ్మట బొంబాయి నగరమున జ్యేష్ఠశుద్ధ పాడ్యమికి పిమ్మట ద్వారకాపీఠస్థుల శాసనముపై యొకజ్యోతిశ్శాస్త్రసభ జరుపదలచియందులకై శ్రీపీఠాధీశ్వాలకు నాహ్వానమునంప శ్రీపీఠాధీశ్వరు లీబోధానంద భారతీస్వాములవారు జ్యోతిశ్శాస్త్రమున నసమాన పాండిత్యమునుఁగలిగి దైవజ్ఞ సార్వభౌములను మహా యశంబునుఁ బడసినవార లగుటచే వారలను శ్రీ పీఠాధీశ్వరులు దమకుఁ బ్రతినిధిగా నియమించి యందులకై శ్రీముఖము నొసంగి వైశాఖ శుక్లాష్టమీ సౌమ్యవాసరమున నంపించిరి. శ్రీ బోధానంద భారతులన్నో పూనాపట్టణమున నివసించియుండి సభాకాలములకు బొంబాయినగరమునకుఁ బోయి వచ్చుచుండెడివారలు. దానంజేసి పూనాపట్టము వాసస్థానముగనుండి యలరారుచుండెడివారలు.—

శ్రీ సచ్చిదానంద భారతీస్వాములవారు:—శ్రీ బోధానంద భారతీస్వాములవారు విజయనగరమునఁ దురీయాశ్రమంబు సేకొనినప్పుడు వారలకు శ్రీసచ్చిదానంద భారతు లుపదేశము ననుగ్రహించిరని చెప్పఁబడెను. వారల గురుపారంపర్యమొకింత యిచ్చట నిరూపించుట యవసరము. ఈసచ్చిదానంద భారతులకు గార్హాస్థ్యమున ఉపాధ్యాయుల సుబ్బారాయుడుగారను వ్యవహారము. వీరలు సాంగవేదాధ్యయన సంపన్నులు. వీరలు వైరాగ్యాతిశయముమీరఁ దురీయాశ్రమంబు సేకొని పూర్వాశ్రమంబున శ్రీరాజ్ఞీ అనంతరామ శాస్త్రిగారను వ్యవహారము గల్గిన

శ్రీబోధానంద భారతీస్వాములవారివలన నుపదేశమునుఁ గ్రహించిరి. ఈ అనంతరామశాస్త్రిగారు పై రాజ్ఞీచెనులుగారికి తండ్రియే. ఇయ్యనంతరామ శాస్త్రిగారును మహావిద్వాంసులు. వైరాగ్యాతిశయము మీఱఁ దురీయాశ్రమము సేకొని పూర్వాశ్రమమున కొడమంచిలి కాపురస్థులైన రేగళ్ల రామయ్యగారు (అబ్బిశాస్త్రిగారు) అను వ్యవహారముగల్గిన శ్రీసచ్చిదానందభారతీ స్వాములవారికడ నుపదేశమును గ్రహించినవారలు. శ్రీసచ్చిదానంద భారతులన్నను విజయనగరమున సిద్ధిపొందిన శ్రీపీఠాధీశ్వరులగు శ్రీమదభినవశంకర భారతీస్వాములవారివలన నుపదేశమును గ్రహించిరి. ఇయ్యభినవశంకర భారతీస్వాములవారికి ఆకొండి వెంకన్నశాస్త్రిగారని పూర్వాశ్రమనామము. ఇయ్యభినవశంకర భారతీ స్వాములవారి జ్యేష్ఠశిష్యులగు సచ్చిదానంద భారతీస్వాములవారి ప్రశిష్యులగు సచ్చిదానంద భారతీస్వాములవారికి శిష్యులీబోధానంద భారతీస్వాములవారు. దానంజేసి శ్రీపీఠాధీశ్వరులగు శ్రీ విద్యానృసింహశంకర భారతీస్వాములవారికి పారంపర్య మర్యాదననుసరించి శిష్యులే యగుచున్నారలు. దానంజేసి శ్రీవారిచే నొసంగబడిన శ్రీముఖమునందిట్లు నిర్వచింపఁబడియున్నది. "శ్రీవిద్యానరసింహశంకర భారతీజగద్గురు స్వామిభిః సర్వతంత్ర స్వతంత్ర దైవజ్ఞసార్వభౌమ సాంఖ్యాచార్య బిరుదాంకితాస్మత్ప్రియతమాంతేవాసి పరమహంస పరివ్రాడ్బోధానంద భారతీస్వామి నేకృతానేక నారాయణస్మరణ పూర్వకం ప్రదత్తేయం శ్రీముఖపత్రికా".

శ్రీబోధానంద భారతీస్వాములవారిని జ్యోతిశ్శాస్త్ర సభకు నంపినపిదప శ్రీపీఠాధీశ్వరులు చాతుర్మాస్యదీక్ష జరుపుటకుగాను రామచంద్రపురం తాలూకా మండపేట గ్రామము సేరి దీక్ష జరపుచు శాః శః 2415 పరాభవ సం॥ ర॥ ఆషాఢ బ॥ ౧౪ శుక్రవారమున (20-7-1906) సిద్ధినొందిరి. సిద్ధినొందుటకు ముందు వారిచే వ్రాయించబడిన విల్లు ననుసరించియు వాగ్దానము (Oral Will) ననుసరించియు మండపేట గ్రామస్థులచే నాలుగుస్థలములకు శ్రీబోధానంద భారతీస్వాములవారి నుద్దేశించి వర్తమానములంపఁబడినవి. అందొక తంతి విజయనగరమునుండి పూనాపట్టణమునకుఁ జేర వద్దానిపై శ్రీబోధానంద భారతీస్వాములవారు వెంటనేబయలుదేరి శ్రీపీఠాధీశ్వరులు సిద్ధినొందిన యేడవదివసమునకు మండపేట గ్రామమునకు విచ్చేసిరి. అప్పటికి శ్రీపీఠము గ్రామోద్యోగులగు మునసబు కరణముల యధీనమున నుంచఁబడి

సర్కారువారిచే సంరక్షింపఁబడుచుండెను. పిమ్మట సర్కారు ఉద్యోగస్థులు శ్రీ బోధానంద భారతీస్వాములవారి యధికారాదికమును లెస్సగ విచారించుటయేకాక లేటు స్వాములవారి విల్నామాన నుసరించి మండపేట గ్రామస్థుల యభిమతమునుఁ బడయుటయేకాక, విశాఖపట్నం, గోదావరి, కృష్ణ జిల్లాలలోని వారలఁ బెక్కులు విద్వజ్జన మహాజనుల ప్రార్థననుఁ గైకొనియు శ్రీపీఠమును 30-7-1906 వ తేదీని యప్పగించుటయేకాక దగ్గరనుండి స్వామ్రాజ్యాభిషేకమునుఁ జేయించిరి. ఈ బోధానంద భారతీస్వాములవారలీ శ్రీపీఠమున శ్రీవిద్యారణ్యులవారికి నలువది యొకటవ పురుషులుగ నలరారుచున్నారలు. శ్రీపీఠచారిత్రమునందు వీరికాలమున నెక్కుడు విశేషములు జరుగుటచే నట్టియతిశయములనొకింతపరూపించెదము. వీరలు పీఠము నధిష్ఠించుటకుఁ బూర్వమే దండత్యాగమును యథావిధి విజయనగరమునఁ జేసిరి. అద్దాని నవకాశాభాసముగఁ జేకొని యనసూయాగ్రస్తులు గొందఱు గాకినాడపురవాసులు విదండికిఁ బీఠాధికారము గలదాయను ప్రశ్నంబును వైచుచుఁగొన్ని తావులకుఁ దమవిజ్ఞప్తులనంపికొనిరి. అవ్వానికిఁగొందఱు విదండికిఁ బీఠాధికారము లేదను పోడిమాటల నిష్ప్రామాణకముగఁ జిత్రించిపంపించిరి. అవ్వానిఁ జేకొని వారలచ్చటచ్చట శ్రీపీఠప్రచారమునకు నడ్డుదగులుచువచ్చిరి గాని యదియంతయు సర్వవిధములఁ నిష్ఫలమైనదని యెల్లరకునుఁ దెలిసినవిషయమే. ఇఁకనీ బోధానంద భారతీజగద్గురు స్వాములవారు శా॥ శ॥ 2416 (క్రీ. శె. 1907) వ వత్సరమున గోదావరిజిల్లా అమలాపురం గ్రామమునఁ జాతుర్మాస్య దీక్షనుఁ బ్రారంభించిరి. ప్రారంభించినదాదిగ శ్రీవారు వ్యాధ్యావిష్టులై యెక్కుడుబాధనుజెందియున్నవారలు. అట్టితరుణమున వాధూల గోత్రోద్భవులగు గంటి బాలకామేశ్వరశర్మయను యువకుడు వివిదిషాసన్న్యాసము నపేక్షింపుచు శ్రావణ శు ౧౦ మీా భానువారముసాయంకాలమున శ్రీపీఠసన్నిధిసేరెను. పిమ్మట నాయువకుడు శ్రీపీఠాధీశ్వరులకుఁ దన యభిప్రాయమును వెల్లడించుటయుఁ తదనంతరము శ్రీపీఠాధీశ్వరులకుఁ బ్రాణభీతి గలుగుటయుఁ దటస్థమయ్యెను. అంత త్రయోదశీ సౌమ్యవారము సాయంకాలమొక విద్వజ్జన మహాజనసభ సమావేశము సేయఁబడి యందు శ్రీపీఠాధీశ్వరులచేఁ నొక వీలు వ్రాయించఁబడి యందీయువకుడు శ్రీపీఠాధీశ్వరత్వమునకు నుదహరింపఁబడెను. అంతసభాసదులాయువకు లెవ్వరని యడుగ తత్సాన్నిధ్యమున నిలచియున్న యువ

కుని శ్రీపీఠాధీశ్వరులు చూచిరి. అంతనా సభాసదులా యువకుని బహువిధములఁ బరీ
క్షింపనట్టి కాలమొక మూడుగంటలు పట్టెను. అంత నాలమూరు రామచంద్రరావు
గారను స్టేషనరీ సబుమేజస్ట్రేటుగారు సభ్యులతో సంప్రతించి సభ్యులయనుమతి నిట్లు
వక్కాణించిరి. "వీరలకు సన్యాసము నేకొనుటకుగాని, వీరిని పీఠాధిపతిగ మనమెన్ను
కొనుటకుగాని యధికారము చాలదనుటకు సభ్యులకు నోరాడదు. కాని శ్రీవారొక వార
మురోజులు గడచిన వెనుక వీరికి నాశ్రమమిప్పింపవలయునని సభవారి తలంపైయున్న
యది"-అంత నాయువకుడు సభవారి నుద్దేశించి రామచంద్రరావు గారితో నిట్లనియె.
"వారము రోజులనుటలో మీ యభిప్రాయ మేమై యుండును. నా కర్హత
లేదనుటకొక మృదుమార్గమా? లేక మరియెద్దియైన యొకటియా? అధికారము
లేదని సభ్యులనినచో నేను సభ్యుల వేరువిధమునఁ దలంచువాడనుగాను. సభ్యులు
నిష్పక్షపాతముగను నిస్సందియముగనుఁ బలుకవలసినదే". అందుపై నయ్యదియొక
లౌకికమునుఁ గూర్చి పలికితిమిగాని మీకునర్హత లేదనుటకు మాకు నెంతమాత్రము
నోరాడదు. అయ్యది శ్రీపీఠాధీశ్వరులకు మేము ప్రత్యేకముగఁ జేసికొను విజ్ఞప్తి
యని నుడివిరి. అంతసభ ముగిసెను. శ్రీపీఠాధీశ్వరులకుఁ బ్రాణభీతి మిక్కుటమయ్యె.
అంతనటకు దరినున్న పేరూరువిద్వాంసులకు వర్తమానముసేయ వారలందరువచ్చి
యాయువకునికి యథావిధి యాశ్రమస్వీకారము సేయించి దండకమండల్వాదుల
గ్రహింపఁజేసి శ్రీపీఠాధీశ్వరులకడ నుపదేశముకొఱకు మంగళవాద్య పురస్సరంబుగ
దోడ్కొనిపోయిరి. శ్రావణ శు॥ ౧౪ గురువారము మధ్యాహ్నము రెండుగంటలకు
శ్రీపీఠాధీశ్వరులు ప్రణవ మహావాక్యోపదేశాదికమును గావించి శ్రీకల్యాణానంద
భారతియను యోగపట్టాభిషిక్తుఁ జేసి శ్రీమహాకామేశ్వరీపరదేవతాపూజనంబు సేయిం
పించి మరల సాయంకాలమున విబుధలోక సముఖమున యోగపట్టమును వ్రాయింపిం
చిరి. పిమ్మట పరదేవతాకటాక్షముచే శ్రీపీఠాధీశ్వరులు స్వస్థతనొంద శ్రీవారి
యనుజ్ఞవడసి శ్రీకల్యాణానందభారతులు ఆశ్వయుజ బహుళంబునుండి అమలాపురం
తాలూకా పేరూరు గ్రామమున సుఖమున నిలచిరి.

1908 సం॥ రం॥ అసలు నెం 6 రు గోదావరిడిస్ట్రిక్టు కోర్టు—జగద్గురు శ్రీ
బోధానంద భారతీ స్వాములవారిని వారి ప్రియతమాంతేవాసియగు శ్రీకల్యాణానంద
భారతీ స్వాములవారిని ప్రతివాదులుగాఁ జేర్చి వకోడీస్వామియను సుప్రసిద్ధ వ్యవహార

ముగల శివానంద సరస్వతియను నాతడు శివానంద శంకరభారతియను పేరుపెట్టుకొని అభినవ విరూపాక్షమను హైకోర్టు 6 మద్రాసు వ్యవహారముగల శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమున్ను అందుకు సంబంధించిన ఆస్తికిన్ని తనకు హక్కును స్థిరపరచి సదరు ఆస్తిని ఖర్చులతో తనపరం చేయవలయునని దావా తెచ్చెను. అందు వాదియొక్క వాదమేమన:- "శ్రీమదభినవ విద్యానృసింహ శంకరభారతీస్వామి దావా పీఠమునకు అధికారిగా ఉండేవారనిన్ని ఆస్వామి వాదికి విధ్యుక్తముగా 19(6 సం॥ మార్చి 27 తేదీని సన్యాసం ఇప్పించి శ్రీశివానంద శంకర భారతీస్వాములవారుఅనే పేరుఇచ్చి తమ శిష్యులుగా ఏర్పాటుచేసికొనినారనిన్ని వారికి ఈవాదితప్ప ఇతరవారసులు లేరనిన్ని ఆస్వామి 19(6 సం॥ జూలై 20తేదీని మండపేట గ్రామములో గలరావల్ల హఠాత్తుగా చనిపోయినారనిన్ని 1వ ప్రతివాదిగారు ఈవాది గురువుగారు చనిపోగానే ఆగ్రామ కాపురస్థులను మోసముజేసి పీఠమునకు తమరే హక్కుదారులు వారసులు అనిన్ని చెప్పి పీఠము స్వాధీనపరచుకొనినారనిన్ని పీఠము పుట్టినప్పటినుంచి అప్పటిపీఠాధిపతులవల్ల విధ్యుక్తముగా శిష్యులుగా చెయ్యబడినవారే పీఠమునకు హక్కుదారులనిన్ని 1వ ప్రతివాదిగారి గురువుగారు సజీవులయి యున్నారనిన్ని దావాపీఠమునకు ప్రతివాదిగారికి హక్కులేదనిన్ని దావాపీఠము 2వ ప్రతివాదిగారి కివ్వడపు ఉద్దేశముతో 1 ప్రతివాదిగారు సన్యాసము నిప్పించినారనిన్ని ప్రతివాదిగారికిగాని వారి గురువుగారికిగాని పీఠమునకు ఏమీ అధికారము లేదనిన్ని ఎన్నిసార్లు అడిగినను 1 ప్రతివాదిగారు పీఠము ఇవ్వలేదనిన్ని".

ప్రతివాదియొక్క ప్రత్యుత్తరము:- వాది దావాసంగతులబద్ధమనిన్ని వాదిదావానిర్వహించ నేరదనిన్ని ఈవాదికి లేట్ శ్రీ విద్యానృసింహ శంకరభారతీ జగద్గురుస్వాములవారు సన్యాసము ఇప్పించినట్లున్ను ఈవాది వారి శిష్యులైనట్లున్ను చెప్పే సంగతి నిజముకాదనిన్ని, ఈవాది షుమారు 3 సం॥ 6 మాసములక్రిందట అనగా క్రోధిసం॥ ఆషాఢశుద్ధ పౌర్ణమాస్యరోజున శికిందరాబాదులో ముకుందానందసరస్వతీస్వామిఅనే గౌడసన్యాసివల్ల సన్యాసము పుచ్చుకొన్నాడనిన్ని, అందువల్లనే సరస్వతీ పేరుతో వ్యవహరించుచున్నాడనిన్ని దావాచేయుటకుగాని ఈపీఠమునకు వచ్చుటకుగాని ఈవాదికి ఏమీ హక్కులేదనిన్ని ఇంతవరకు పీఠముఖాళీచేసిన పీఠాధికారి శిష్యుడుమాత్రమే పీఠం రావలసినదని చెప్పేసంగతి నిజముకాదనిన్ని లేటుస్వాములవారి

వల్లవారియబడి 1906 జూలై 19 తేదీగల వీలులో తెలియజేసిన అధికారమును బట్టి మండపేట గ్రామశాపుగస్తులు 1వ ప్రతివాదిగారికి పీఠాధిపత్యము ఇచ్చినారనిన్ని లేట్ స్వాములవారు ఆరోజుననే మూజువానీ వీలు 1 ప్రతివాదిగారికి పీఠము ఇవ్వవలసినదని చెప్పినారనిన్ని తమ అనంతర పీఠాధికారిని ఏర్పరచుటకు తమమతస్థులలో కొందరికి అధికారముబట్టి లేట్ స్వాములవారికి అధికారముగలదనిన్ని లేట్ స్వాములవారి వల్ల స్పెషల్ అధికారము ఇవ్వబడకపోయినప్పటికి వారు మండపేట గ్రామములో సిద్ధిపొందుటచే ఆగ్రామస్థులు చేసినఏర్పాటు శాస్త్రసమ్మతమయినదనిన్ని చెల్లదగుననిన్ని ఈవాది సికిందరాబాదులో సన్యాసము పుచ్చుకొన్న కొద్దిరోజులలోనే తన దండకమండలవులను పారవేసి జుట్టు పెంచుకొని జంజెము వేసికొని వంట బ్రాహ్మడిగా పనిచేసినాడనిన్ని అందువల్ల అతనికి సన్యాసము చెడిపోవడమున్ను బహిష్కారుడు పతితుడు అయినాడనిన్ని కాబట్టి పీఠాధికారమునకు వాది అర్హుడుకాడనిన్ని తర్వాత కొంతకాలమునకు స్వయముగా సన్యాసివేషము వేసి సన్యాసివలె ప్రవర్తించినాడనిన్ని ఇతను కేవలము అనర్హుడనతగలవాడనిన్ని ప్రతివాది తెలియచేసిరి.

తీర్మానము:—ఈదావా మహారాజశ్రీ దివాన్ బహద్దరు యమ్ ఓ. పార్థసారథిఅయ్యంగారు అవర్గల్. యమ్. ఏ. యమ్. యల్. డిస్ట్రిక్టు జడ్జిగారివలన 1908 సం॥ నవంబరునెలలో శుక్రవారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము అనగా 13, 23, 24, 25, 26, 27 తేదీలను విచారణకు రాబడి 1908 డిశంబరు 30 తేదీ బుధవారము వరకు ఘనమైన ఆలోచనలో ఉంచబడి వాది లేట్ స్వాములవారికి శిష్యుడెంతమాత్రమును గాకపోవుటయేకాక ఆరూఢపతితుడగుట చేతనుకూడా వాది దావాఖర్చులతో కొట్టివేయుడమైనది. వాది గవర్నమెంటుకు స్టాంపుడ్యూటీ ఇచ్చుకొనవలసినది. అని తీర్మానము పబ్లికు కోర్టులో చెప్పబడినది. ఇందు జడ్జీగారొక చమత్కారమైన విషయమును గనిపెట్టినారు. అయ్యది లోకసంగ్రహమునకై యిందుదహరింపు చున్నారము—

"1వ ప్రతివాదిగారు విడంబులయి పీఠాధిపత్యము చేయుట ఏకారణముచేతనో చూచి సహించలేనివారై కొందరు ఈదురదృష్టవంతుడగు వాదిచేత పాపరుదావా తెప్పించి పీఠమునకు హాని నిమిత్తమై బయలుదేరతీసిరి. అని- ఇక వాది పక్షమున విచారణ చేయబడిన సాక్షులు. 1 శివానందశంకర భారతీస్వాములవారు. 2 కొల్చినరామా

వధానులు. 3 కొండమహాంతి వేమసుందరం. 4 సచ్చిదానందశంకరభారతీస్వాముల వారు. 5 సాగి రామశాస్త్రిగారు. 6 విశ్వనాథం విశ్వనాథం. 7 భీమమెట్టు లక్ష్మీనరసింహం. 8 కప్పగంతుల కామయ్య. 9 బులుసు నరసింహం." ఈసాక్ష్యముల గూర్చి జడ్జీగారు ఇచ్చిన అభిప్రాయము "వాదితరపున వాదే ప్రథమసాక్షి. 2, 4 సాక్షులు సారాంశమునకు సంబంధించిన సాక్ష్యము ఇవ్వలేదు. 6 మొదలు 9 వరకు సాక్ష్యములు నాకు విశ్వాసార్హముగా తోచలేదు. 7, 9 సాక్షులు యాచనవల్ల జీవనము చేయువారు. 8 వ సాక్షి సత్రములో వంటబ్రాహ్మణుడు" అని-

☞ పకోడీ స్వామియొక్క యనంతరకృత్యము.

పకోడీస్వామియొక్క యనంతరకృత్యము:—పైదావా త్రోసివేయంబడి నైజస్థితి లోకమునకు వెల్లడియైనప్పటికిని పకోడీస్వామి యూరకొనక నైజాంరాష్ట్రమున హాంపిపీఠమను ప్రసిద్ధితోం జరింపుచున్న పీఠాభాసముకడకుంబోయి యందుండిన సచ్చిదానందాభినవోద్దండ విద్యారణ్య భారతీస్వామియనువానితోం దానభినవ విరూపాక్ష పీఠమునందుండి మండపేటలో సిద్ధిపొందిన స్వాములవారి శిష్యుడననియు, గురువుగారి యనంతరము పీఠమును శ్రీబోధానంద భారతీస్వాములవారు ఆక్రమించుకొనిరనియు నద్దానిపైం దాను తెచ్చినదావాలో జడ్జీగారన్యాయము చేసిరనియు నట్టి పీఠాధికారమునుం దనకిచ్చినచో సంవత్సరమున కారువందలరూపాయలచొప్పునం గప్పముగట్టెదననియు జెప్పనాహాంపిస్వామి వల్లెయని జడ్జీగారి తీర్మానమును రద్దుసేయుచు నొకయధికారపత్రము నీపకోడీస్వామికిచ్చెను. ఇక్కడనుండియు హాంపిపీఠపు ప్రస్తావన పరిపరివిధముల దటస్థమగుచుండుగావున నద్దానిగురించి యిచ్చట ప్రత్యేకముగ ముచ్చటింప నవసరములేదు. పకోడీస్వామి యా యధికారపత్రమునుం గొనివచ్చి తాను జగద్గురుత్వమును హాంపిపీఠమువలన గొనివచ్చితిననియు సందులకై సుంకములనీయవలయుననియు నజ్ఞుల బెదరింపుచు నొకనిపై బహిష్కారపత్రికనుం బ్రయోగించెను. అంత నాతడు పెద్దాపురం డెప్యూటీకలక్టరుగారివద్ద నభియోగమును దెచ్చెను. కలక్టరుగారు పకోడీస్వామికి హాంపిపీఠమిచ్చిన యధికారము కోర్టుతీర్మానమునకు విరుద్ధమగుటచే నన్యాయమనియు దానంజేసి బకోడీస్వామిచేసిన బహిష్కార మక్రమమనియుం దీర్మానింపుచుం పకోడీస్వామికి నూరురూపాయలు జరీమానాను విధింపుచు నద్దాని చెల్లించనిచో నొకమాసము శిక్షను విధించెదమనిరి.

అంత పకోడీస్వామి జరీమానానుఁ జెల్లించి మిన్నకుండెను, ఇట్లుండ నీపకోడీస్వామి రాజమండ్రి డిస్ట్రిక్టుకోర్టులోఁ దెచ్చినదావాలో నాలవసాక్షిగా నుదహరింపఁబడిన సచ్చిదానందశంకర భారతీస్వామి, కనకదండిస్వామి యను నాతఁడు పకోడీస్వామి కడకుఁబోయి నీకు సమర్థత చాలదు. నాకు పవర్ అఫ్ అటార్నీ యియ్యవలసినది. ఉభయులముఁ గలసి పీఠాధిపత్యము నడుపుదమని చెప్పి యాతనివలన నొక పవర్ అఫ్ అటార్నీ (Power of attorney) వ్రాయించిపుచ్చుకొని యుభయులునుఁ గొలది రోజులు గలసి తిరుగ నయ్యది కనకదండి స్వామికి ప్రయోజనమునుఁ గల్గింపలేదు. అంతనీ కనకదండిస్వామి హంపి పీఠము కడకుఁబోయి యాతనివలనఁ బకోడీస్వామికిచ్చిన యధికార పత్రికను రద్దుచేయించి విరోధికృత్ సం॥ ర కార్తీకమాసమున (1912 A. D.) దానొక యధికార పత్రమును సంవత్సరమునకు వేయిరూపాయలు గప్పము గట్టుషరతుతోఁ గొనివచ్చెను. పిమ్మట పకోడీస్వామికొక రిజిస్టర్డునోటీసునిచ్చి వెంటనే రాజమండ్రి డిస్ట్రిక్టు మునసబు కోర్టులో శ్రీ పీఠాధీశ్వరులగు శ్రీ బోధానంద భారతీస్వాములవారి పైనను వారి శిష్యులగు శ్రీ కల్యాణానంద భారతీ స్వాములవారిపైనను నొక యభియోగమునుఁ దెచ్చెను. ఇయ్యది 127 నెం॥ రు హాసలు దావా॥- ఈదావావిషయమును వివరించుటకు ముందీ కనకదండిస్వామి చరిత్రమును వివరించెదము:—

కనకదండిస్వామి:—ఈత డేలూరు పురమునకు సమీపమునసుండు నొక పల్లెటూరు నందలి పైడిమర్రివారి పిల్లవాడట. ఉరట్ల గ్రామమునందలి కనకదండి వారికి దత్తుడు. పేరు వెంకటరమణయ్య. సర్వసిద్ధి గ్రామమునకు దగ్గరనుండు బసవపాడు గ్రామమునందలి దేవులపల్లివారి యల్లుడు. ఈతనికొక కొమరుడునుఁ గొమార్తెయును. ఈతడు భూతవైద్య రాజవైద్యములఁ జేయుచుండెడివాడట. దొంగ దస్తావేజులను సృజించుటయందు నెక్కుడు ప్రజ్ఞగలవాడట. అద్దానిచే నీతడు దనకుఁగల యావదాస్తినిఁ గోలుపోవుట యటుండ నప్పులదీరువలేక పోవుటచే తుని గ్రామపు కాపురస్థుడగు నందవరపు అప్పన్న యను నాతనిచేఁ (ఈతనికి దావాలఅప్పన్న అని సుప్రసిద్ధవ్యవహారము) స్థలభాండ విసర్జనము సేయించఁబడుటయేకాక సెర్చి వారంటు ద్వారా వెదకింపఁబడుచుండ నొకానొక రాత్రి కొరుప్రోలు గ్రామములో నొక పెరటియందలి యరటిచెట్లలో గూర్చుండి ముండనముసేయించికొని శిఖాయ

జ్ఞోపవీతముల ద్రెంచికొని కావిగుడ్డల గట్టికొని యురట్లమార్గమునఁ బరువిడుచుండ నెందేశమ్మ వాకలో సర్కారు భటులకుఁ జిక్కెనట. సర్కారుభటులీతని కోర్టు వారి యెదుటఁ నిలువబెట్ట నన్యాయము సన్యాసినిఁ బట్టుకొనిరని యలమించిరి కోర్టులో గల్లంతుఁ జేసెనట. అంతకోర్టువారు గరుణించి విడచిపెట్టిరట. లౌకిక ప్రతిబంధకములు దీరిన వెనుక నత్తవారి గ్రామమునకుఁ బోయి తెలుగ గార్హస్థ్యము నభిలషింప నక్కడి సుప్రసిద్ధ విద్వాంసులగు నిండ్రకంటి పెదవెంకటావధానులు గారు తిరుగఁ బుటము వైచినను వలను పడదని చెప్పిరట. అంత తన దేవతార్చనను జేకొని దానిని రాజరాజేశ్వరీ పీఠమని చెప్పుకొనుచుఁ గొంతకాలము పసలపూడి జగద్గురు సంస్థానమనియుఁ గొంతకాలము గొవ్వూరు జగద్గురు సంస్థానమనియుఁ జెప్పుకొని తిరుగుచు పిమ్మట తనకుమారుడు సనిపోయిన పిమ్మట హంపి పీఠము కడకుఁజని యధికార పత్రికనొకదానిఁ దెచ్చికొని శ్రీ భోధానంద భారతీస్వాముల వారిపై యభియోగమునకు దిగెను.*

కనకదండిస్వామి యొక్క స్వభావము:—ప్రకృతపు సందర్భమునఁ గనకదండి స్వామియొక్క స్వభావము నొకింత లోకము తెలిసికొనవలసి యున్నది. అందులకై యొకింత కార్యగౌరవమునుఁ బ్రదర్శింపుచున్నారము. బహిరంగమగు వ్రాతములలో శివానంద సరస్వతియని చేవ్రాలుసేసి క్రయ విక్రయ దస్తావేజులఁ బడసినట్టియు సికిందరాబాదులో సుప్రసిద్ధముగ ముకుందానంద సరస్వతి యను గొడసన్యాసి వలన నుపదేశాదికమును గ్రహించి పిమ్మట కొలదిదినములలో నచ్చటనే దండకమండలములను గురువుపై వారవైచి జందెము వేసికొని తెల్లగుడ్డలనుఁ గట్టికొని పెండ్యాల వెంకట్రామయ్య యను వ్యవహారముతోడనే కొన్నిరోజులు సబ్ అసిస్టెంటు ఇన్స్పెక్టరుగా నుండెడు కలపట సుదర్శనరావుగారివద్ద వంటపూటిపని చేసికొనుచును బకోడీల దుకాణముపెట్టికొనుచునుఁ గాలము వెళ్ళించుచు మరల హఠాత్తుగ గనకదండి స్వామివలె జందెములఁ ద్రెంచికొని కావిగుడ్డలఁ గట్టిన భ్రష్టును శివానంద శంకరభారతిగ మార్చి మండపేటలో సిద్ధిపొందిన శ్రీ పీఠాధీశ్వరుల వలన నుపదేశము గ్రహించెనను సాక్ష్యమును గోదావరీ డిష్ట్రిక్టు కోర్టులో 1908 సం॥రం 6 వ నెంబరు హాసలు దావాలో నప్రతిహతముగ సాక్ష్యమునిచ్చెను. పిమ్మట నావ కోడిస్వామి వలన పవర్ ఆఫ్ అటార్నీనిఁ గొని లోకమును వచింప గడంగెను.

అయ్యది చాలక హంపి పీఠమునకు బోయి పకోడీస్వామినిఁ దప్పించినటులనుఁ దన్నునియమించి నటులను నొకపత్రిమునుఁ గొనివచ్చి యభియోగమునకు దిగెను. అందుఁ దానొక భారతీ సాంప్రదాయపు సన్యాసిననియు, పీఠ పరంపరలోని వాడననియును భ్రమింపఁజేయు నొక వంశవృక్షమునుఁ దనకుఁ గల్పించికొనెను. ఏతద్విషయము మున్ముందు వివరింపఁ బడును.

1912వ సం॥ రం॥ రాజమండ్రి మునసబుకోర్టు 127 నెంబరు వాసలుదావా—

ఈదావాలో పైనుదహరింపఁబడిన కనకదండిస్వామి శ్రీసచ్చిదానంద శంకరభారతీ జగద్గురుస్వాములవారు పీఠాధికారి, అభినవ విరూపాక్ష సంస్థానము అను పేరుతో వాదిగ నిలచియున్నాడు. ప్రతివాదులు 1 శ్రీబోధానంద భారతీస్వామి 2 శ్రీకల్యానానంద భారతీస్వామి.

వాదియొక్క వాదము:-వాది అభినవవిరూపాక్ష పీఠమున కధికారియనియును ఏలూరు నుండి జగన్నాధమువరకునుండే స్మార్తులందరకును మతగురువుగా ప్రకటింపబడవలయుననియు 1వ ప్రతివాది యట్టియధికారమును జేయుచుండుటులను ప్రజలవలన భిక్షలను పాదపూజలను గ్రహింపకుండ శాశ్వతముగ నరికట్టుటకు నధికార మీయవలయుననియు ప్లెయింటుషెడ్యూలునం దుదహరింపఁబడిన ఆస్తిఖర్చులతో నిప్పింపవలయుననియు దావా. ఇంక ఏలూరునుండి జగన్నాధమువఱకును గల దేశమంతయు విద్యారణ్యస్వాములవారిచే స్థాపింపబడిన హంపివిరూపాక్ష పీఠపు టధికారమునకు లోబడినదనియు హంపివిరూపాక్ష పీఠాధికారియగు నభినవ శంకరభారతీస్వామి శాలివాహనశకము 1687వ సంవత్సరమున అభినవ విరూపాక్షమను క్రొత్తపీఠము నేర్పరచి తన శిష్యుడగు ఉద్దండభారతుల నధిపతిగఁ జేసి పైనుదహరింపఁబడిన దేశమున మతాధికారమునుఁ జేయునటులను పీఠమునకు దనశిష్యులలోనుండి యధికారి నేర్పరచుటకును అట్టి యధికారము శిష్యపరంపర్యక్రమమున నడుపుచు ఎద్దియేని కారణముచేఁ గాళీయైనచో హంపిపీఠాధిపతియే క్రొత్తపీఠమునకు పీఠాధికారి నేర్పరుపవలయుననియు, అట్లుఉద్దండభారతులకు బిమ్మట బోధానందభారతులను నాతడును ఆతని వెనుక అభినవోద్దండ నృసింహభారతులును పీఠాధిపతులుగాగ నభినవోద్దండ నృసింహభారతులు 1746 శాలివాహన శకమున శిష్యు నేర్పరుపకుండ దేశాంతర గతుడుగాగ హంపి పీఠాధిపతి శ్రీమదభినవోద్దండ బోధా

నంద శంకరభారతులను 1749వ సంవత్సరమునఁ బంపెననియు 1818వ శకము వరకు నాతని పరంపరచే నధిష్టింపఁబడినదనియు పిమ్మట శ్రీవిద్యానృసింహశంకర భారతి పీఠాధిపతియయ్యెననియు నీతడు 20—7—1916వ తేదీని తనకు వారసుని నియమించకుండ సిద్ధిపొందుటవలన పీఠము కాళీయైనదనియు నట్టి కారణముచే హంపిపీఠాధిపతి పూర్వపునియమము ననుసరించి క్రొత్త స్వామినిఁ బంప నధికారము గల్గియున్నాడనియు నిట్టి పరిస్థితులలో నొకటవ ప్రతివాది మండపేట వెళ్ళి కొందరు గ్రామస్థుల సహాయముచే ప్లెయింటు షెడ్యూలులో నుదహరింపఁబడిన పీఠము [illegible]తో సంబంధించిన వస్తువుల దానే స్వార్థులకు గురువునని చెప్పుచు నాక్రమించుకొనెననియు ఒకటవ ప్రతివాది శేటు విద్యానృసింహ భారతులశిష్యుడు కాకపోవుట యటుండ విసండియు నారూఢపతితుడునగుటచే పీఠము నధిష్టించుటకు నర్హుడు కాడనియును హంపి పీఠపు ప్రకృతపుటధికారి 28-11-1911వ సంవత్సరమున నధికారపత్రిమూలకముగ తగిన శిష్యుని దాను పంపువరకు స్వార్థులపై నధికారమును జరుపవాదిని నియమించుటచే వాది దావాసొత్తును ఒకటవ ప్రతివాదినుండి రాబట్టుకొనుటకును హక్కునుఁ గలిగియున్నాడనియు ఒకటవ ప్రతివాదిని శాశ్వతముగ నరికట్టుటకు నధికారమును బొంద నధికారమును గల్గియున్నటుల ప్లెయింటులో నుదహరింపబడియున్నది.

ఒకటవ ప్రతివాది యొక్క వాదము:—1 ప్లెయింటులోని ప్రధానపు విషయములెంతమాత్రమును నిజముగావు. గావున వాదియొక్క దావానిలువనేరదు. 2 ప్లెయింటు మూడవపేరాలో నుదహరింపఁబడినటుల హంపి విరూపాక్షపీఠమని నూతనపీఠమెన్నడును వ్యవహరింపఁబడలేదు. శ్రీ విద్యారణ్యులవారిచే స్థాపింపఁబడిన పీఠము విరూపాక్షపీఠముగా దెలియఁబడుచుండెను. 3 నాలుగవ పేరాలో విషయములు నిజముకావు. జబ్బుపడినది అభినవ విద్యారణ్య స్వామిగాని యభినవ శంకర భారతీ స్వామి కాదు. జబ్బుపడి యస్థైర్యముచే పీఠము నుద్దండ భారతులను వ్యవహారము గల్గిన ఉద్దండ శంకభారతీ స్వాములకు శాలివాహన 1717 వసంవత్సరమున పుష్కలమగు మఠాధికారముతోడను యాజమాన్యముతోడను విరూపాక్ష పీఠరాష్ట్రము నంతయు నప్పగించెను. విరూపాక్ష పీఠాధికారమునకు లోబడిన దేశము ప్లెయింటు నాలుగవపేరాలో నుదహరింపఁబడిన దేశమునకు తోడుగ నైజాంరాష్ట్రము గూడ

గలదు. ఉద్దండశంకర భారతీస్వామి పుష్కలాధికారమును రాష్ట్రమునందంతటను సుమారెనిమిది సంవత్సరములు జరపెను. ప్లైంటు మూడవ పేరాలో నుదహరింపఁబడినట్లు అభినవశంకర భారతీస్వామి స్వల్పదేశమునకొక పీఠమును ఏర్పాటు చేసెనన్నమాట నిజముగాదు. 4 ప్లైంటు నాలవ పేరాలో నుదహరింపఁబడినట్లు ఉత్తర వారసుని నియమించు నధికారమును అభినవ శంకరభారతి, తనయందుంచుకొనెనను మాటయు నట్లు ఒప్పందమైనదను విషయము నిజముగాదు 5 ఉద్దండభారతికి యనంతరము పీఠమునకువచ్చినపేర్లు ఐదవ పేరాలో నుదహరింపఁబడినవి నిజముగావు. ఉద్దండ నరసింహభారతి అభినవోద్దండ నరసింహశంకరభారతి, అతని యనంతరము అభినవశంకరభారతియు విరూపాక్ష పీఠము నధిష్టించిరి. 6. విరూపాక్షపీఠము నభినవ విరూపాక్షమని పిలుచుట కొలదిసంవత్సరములనుండియుగలిగి వ్యవస్థకారకు గ్రొత్తగా జేర్చబడినది. 7 ప్లైంటు ఆరవ పేరాలో యుదహరింపఁబడిన అభినవోద్దండ నృసింహ భారతికి అభినవ శంకరభారతి యను వ్యవహారముగూడకలదు. ఆయన వెనుక బోధానంద విద్యాశంకర భారతిపీఠము నధిష్టించెను. హంపిపీఠపు అభినవశంకర భారతీస్వాములు దావాపీఠమునకు నధిపతినేర్పాటుచేసె ననువిషయ మసత్యము 8 ప్లైంటు 8, 9 పేరాలలోని విషయము లసత్యములు. లేటు విద్యానరసింహ శంకరభారతీస్వాములవారు మండపేట బ్రాహ్మణులకు తగినవాడని పీఠమున కేర్పాటుచేయవలయునని 2-7-1916న యొకవీలును వ్రాసిరి. దాని ననుసరించి మండపేట బ్రాహ్మణమహాజనులు సభగూడి ప్రతివాదినెన్నుకొని పీఠాధిపతిగ నభిషేకమును జేసిరి. అట్లుఁ జేయుటలో వారలనేక గ్రామముల మహాజనులచేఁగూడ నభినందింపఁబడిరి. కావున ప్రతివాది లేటుస్వాములవారి పీఠము నధిష్టించుటకు హక్కును గల్గియున్నాడు. 9 అంగీకరింపరాదు. లేటుస్వాములవారు వ్రాసియున్నవీలుచే ప్రతివాది కిచ్ఛగల్గినచో వానిని నేర్పాటుచేయవలయుననియుఁ జెప్పుటచే ప్రతివాది హక్కునుగల్గియున్నాడు. 10 తనకు సన్యాసి శిష్యులు లేనప్పుడు దన పీఠ సాంప్రదాయము వారలనుండియు నట్టివారలు లేనిచో భారతీ సాంప్రదాయపు సన్యాసుల నుండియు నుదహరింపుటకు లేటుస్వామి హక్కును గల్గియున్నారు. 11 న్యాయముచేతను ఆచారముచేతను లేటు స్వాములవారు దనకు వారసుని నిర్ణయించుటకు దనసామాన్యపు శిష్యులకు నధి

కారము నిచ్చుటకుగూడ హక్కును గల్గియున్నారలు. 12 న్యాయముచేతను ఆచారముచేతను పీఠము ఖాళీయైనస్థలమునందలి మహాజనులకు పీఠాధిపతి యధికారమీయకపోయినను వారసునెన్నుటకు నధికారముండుటచేగూడ మండపేటవారు ప్రతివాది నెన్నుకొనుట న్యాయసమ్మతము. 13. ప్లైంటు పదియవపేరాలోని విషయము లసత్యములు. ప్రతివాది ఆరూఢపతితుడని చెప్పుట యసత్యము, నవమానకరమును. 14 ప్రతివాదికి యేకారణముచే పీఠాధికార యోగ్యతలేదని ప్లైంటు పదియవపేరాలో నుదహరింపఁబడెనో యాకారణములచేతనే వాదికి వ్యాజ్యస్థానమును జేకొనస్వాతలేదు. 15 వాది భారతీసాంప్రదాయపు సన్న్యాసిగాడు. హంపివిరూపాక్షపీఠముయొక్కయుగాని దావాపీఠముయొక్కయుగాని సన్న్యాసిశిష్యుడునుగాడు. దానిచే నీయాధిపత్యమునకు నియమింపబడుటకుగాని యాధిపత్యమునుఁ జేయుటకుగాని యెంతమాత్రము నర్హుడుగాడు. 16 వాదిచే నాధారము చేసుకొనఁబడిన 28-11-1911 తేదీ దస్తావేజునకు న్యాయమగు యోగ్యతలేదు. ఆదస్తావేజుచే వాది దావాపీఠమునకు నధికారిగా నియమింపబడియుండలేదు. అందుదహరింపఁబడిన యధికారములు ప్లైంటులో నుంచుకొనబడినట్లుదహరింపఁబడిన యధికారములతో సంబంధించియుండలేదు. 17 ఏవిధమునఁ జూచినను ప్లైంటు 12వ పేరాలో వాది యుదహరించిన హక్కు లోకసంగ్రహము ననుసరించి సమంజసముకాకపోవుట యటుండ నన్యాయముఃగూడ నగుచున్నది. హంపిపీఠమునకు దావాపీఠముపై నెట్టియధికారమును లేదు. గావున హంపిస్వామి పై యుద్యోగము నిచ్చుటకెంతమాత్రము నర్హత గలిగియుండలేదు. అట్లుండెనని యనుకొనినను అట్టిహక్కు శివానందశంకరభారతిస్వామిని నియమించుటచే నస్తమించెను, రెండవసారి యుద్యోగము నిచ్చుటకు నెంతమాత్రము నధికారములేదు. ఎట్టులైనను ప్రకృతపుదావానిమిత్త మీవాదిని నియమించుటయు నట్టి యుద్యోగమొకింత కాలములో నస్తమించుటయు లోకసంగ్రహ విరోధమేకాక యాయుద్యోగపు టభిప్రాయమునకు భంగకరము. 18 వాది నీయుద్యోగమునకు నియమించుట యందలివ్యాపారము మతాధికారములగుటచే లోకసంగ్రహ విరోధము. 19 దావాపీఠమును రాబట్టుకొనిన వెంటనే యస్తమించునట్టి తాత్కా

లికాధికారము నిచ్చుటకు హంపిపీఠమున కెట్టియధికారమును లేదు. 20 ప్లైంటు 13, 14 పేరాలలో నుదహరింపఁబడిన విషయము లసత్యములు. న్యాయముచే పీఠాధికారియగు ప్రతివాది నెట్టి విధముగ తకరరుచేయుట కెంతమాత్రము నధికారమును వాదిగలిగియుండలేదు. 21 ఇందుదహరింపఁబడిన విషయములు దక్క వేరొక విషయమును ప్లైంటులో నుదహరింపబడినదానిని ప్రతివాది యెంతమాత్ర మంగీకరింపకపోవుట యటుండ ఖచితమైన ఋజువునుగూర్చి వాదినితగాయిదా చేయుచున్నాడు. 22 వాది యెట్టివిధమైన ప్రతిఫలమునకు హక్కునెంతమాత్రమును గలిగియుండలేదు. కావున నతడు కోరిన ప్రతిబంధమునకు హక్కునెంతమాత్రమును గలిగియుండలేదు." అని ప్రతివాదుల వాదము.

తీర్మానము:—ఈవ్యాజ్యమున పదునొకండు సారాంశము లీయబడిసుమారు రెండుసంవత్సరములు తీవ్రమగు విచారణలోనుంచఁబడి వాదియొక్క దావాఖర్చులతోఁగూడ కొట్టివేయఁబడి ప్రతివాదులకు ఖర్చులిప్పింపఁ బడినవి.

వ్యాజ్యమువలన దేలిన సారాంశములు:—1 ప్రకృతపు దావాపీఠము శ్రీ విద్యారణ్యులవారిచే విరూపాక్ష క్షేత్రమున సకలభువనైక పూజ్యముగఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీపీఠరాజమనియును హంపిపీఠము కృత్రిమపీఠమనియును, దానంజేసి హంపిపీఠమునకు దావాపీఠముపై నెట్టిహక్కులు లేకపోవుట యటుండ దావాపీఠమునకు సర్వవిధముల లోబడియుండవలసినదే యనియును. 2 విరూపాక్ష శాస్త్రిచే నవహరింపఁబడినట్లు రుజువు కాలేదని విశాఖపట్టణమున తిరుగుడుకోర్టు డిక్రీలో యుదహరింపఁబడిన కాగితములు హంపిపీఠము వారిచే దాఖలుచేయబడి నిజము బయల్పడుటచే నీహంపిపీఠము మొట్టమొదటినుండియు దొంగపీఠమనియును నందు దుండగీడులు దక్క వేరొకరు నేటివఱకు లేరనియును. పీఠమును బ్రత్యక్షముగ నొకింత గన్నులు విచ్చిచూచినవారికి నిజము గరతలామలకముగ దెలియగలదు.

కనకదండిస్వామి కల్పనానైపుణ్యము (Forgery):-హంపిపీఠ మందుండిన నభినవ శంకర భారతీస్వామి శాలివాహన శకము 1687వ సం॥రమున అభినవ విరూపాక్షమనుఁ గ్రొత్తపీఠము నేర్పరచి తనశిష్యుడగు నుద్దండ భారతుల నధిపతిగఁ జేసి ఏలూరు మొదలుకొని శ్రీజగన్నాథము వరకు గల దేశమున సంచారము

చేయునట్లుగొన్ని నియమములతో నియమించెననియు నట్లు నుద్దండ భారతులకు బిమ్మట బోధానంద భారతులును ఆతని వెనుక నభినవోద్దండ నృశింహాభారతులును పీఠాధిపతులుగాగ నభినవోద్దండ నృశింహాభారతులు శా॥ శ॥ 1746 లో శిష్యునే ర్పరచకుండగనే దేశాంతర గతుడయ్యెననియు నప్పుడు హంపిస్వామి శ్రీమదభిన వోద్దండ బోధానందశంకర భారతులను 1749వ సం॥రమున బంపెననియు, దేశాంతర గతుడైనస్వామి 1748 వ సం॥రమున సిద్ధిపొందునపు డొక శిష్యునకు దేశాంతరమున నుపదేశముఁజేసెననియు నాతనిపరంపరయందు వచ్చిన యొకసన్యాసివలనఁ దానుప దేశమును గ్రహించెననియు దానంజేసి తానుగూడ భారతీ సాంప్రదాయపు సన్యాసి నేయనియు నొకయద్భుతకల్పనను గల్పించుకొనుట యేగాక పకోడీస్వామి మండ పేటలో సిద్ధిపొందిన స్వాములవారి శిష్యుడేయనుచుఁగూడ వంశవృక్షము నొకదాని ప్రదర్శించెను.

పైవిషయముల నిజస్థితి:—పకోడీస్వామి మండపేటలో సిద్ధిపొందిన స్వాములవారి శిష్యుడుగాకపోవుట యేగాక నారూఢపతితుడనియు గూడ 1903 రాజమండ్రి డిస్ట్రిక్టు కోర్టువారి అసలుదావా నెం 6 రులో నిర్ధారణ చేయబడినప్పటికిని1912 లో తానుఁ దెచ్చినదావాలో మరల యాతనివిషయమై యబద్ధమునే కనకదండిస్వామి లిఖించియున్నవాడు. శా॥ శ॥ 1746లో స్వాములవారు దేశాంతరగతులై 1748 లో సిద్ధిపొందిరని యుదహరించినాడు. ఆస్వాములవా రెన్నడును దేశాంతరగతులు కాలేదనియును వారు 1746 లో విజయనగరమున సిద్ధిపొంద వారి శిష్యులు కొలదిమాసములలోనే విశాఖపట్నం కలక్టరుగారి యుత్తరవును 7—4—1825 నపొంది విజయనగర సంస్థానాధీశులచేఁ బట్టాభిషేకము జేయింపఁబడినట్లు లిఖితములున్నయవి. విజయనగరమున శా॥ శ॥ 1746 లో సిద్ధిపొందిన స్వాములవారు దేశాంతరమున 1784లో శిష్యునకుపదేశమే చేసినయెడల పిశాచరూపమునఁ జేయువలయును గాని వేరొకవిధమునఁ జేయునవకాశ ముండదు గావున నీకనకదండి స్వామియొక్క సన్యాసపరంపర పిశాచపరంపర గావలయునుఁ గాని వేరొక పరంపరయగుటకు వీలు లేదు. అట్టివిషయమున నాతనిచేఁ బ్రకటింపఁబడిన యాతని పరంపరకల్పిత పిశాచ పరంపరయని బుధులు గ్రహింపగలరు. ఇంతియకాదు. తానుసన్యాసము నవధూతగాఁదీసికొనెననియు, దానంజేసి దండకమండలముల గ్రహింపలేదనియు నవధూత

భుగుండనకు నవధూతయగు గురువుపదేశముం జేసెననియుం గోటులలో ప్రమాణ వాక్యములను నిచ్చియున్నాడు. సన్యాసమునుం జేకొనుటలో దండగ్రహణముం జేయనిచోం నట్టివానికిం బ్రేతత్వము నివృత్తిజెందదనియు నట్టివాడు ప్రేతతుల్యుడు గాని సన్యాసి యెంతమాత్రమునుం గాడనియు బుధులు వ్యక్తీకరింపు చున్నారలు. ఈతని సన్యాసము శాస్త్రీయసన్యాసముగాదు గావున నీతడు పరివ్రాజక బ్రువుడు గాని పరివ్రాజకుడెంతమాత్రమునుం గాడని శ్రుతి స్మృతి సదాచారములు ఘోషింపు చున్నవి. ఇంతియకాదు. శ్రీబోధానంద భారతీ స్వాములవారు కనకదండి స్వామి భారతీ సాంప్రదాయపు సన్యాసి కాకపోటయటుండ నారూఢపతితు డనియునుం గంఠోక్తిగం బలుకుటయటుండ వ్యవహారములందు గూడ భారతి యను పల్లవమును దీసివేసియే యాతని పేరును వ్రాయింపించుచుండెడి వారలు. అద్దానికాతడెన్నడును వగచినది లేదు. ఏలనన నీతనిసన్యాసము పైన మాచే నుదహరింపంబడినట్లుంగదళీవస్త్ర సన్యాసమో లేక ఎండదేశమ్మువాక సన్యాసమో కాని వేరొండుగాదు. కొంతమంది గొడవెలమవాళ్లసన్యాసి యనియు నపహాసముగాం జెప్పుటకలదు. ఇంతకుం దక్క వేరొండు సన్యాసవిశేష మీతనియందుం గానరాదు. ఇంకనభినవ విరూపాక్షమను పేరిట నుద్దండభారతులకు నేలూరు మొదలు శ్రీజగన్నాథము వఱకు నధికారము నిచ్చిరను విషయము పిమ్మట శా. శ. 1746 లో పీఠస్థులు దేశాంతరగతులైరను విషయము, పిమ్మట శా. శ. 1749 లో హంపిపీఠస్థులు పీఠాధిపతినిం బంపిరను విషయములును స్వకపోల కల్పితములుగాని సత్యమెంతమాత్రమును గావు.

1. హంపిస్వామియొక్క పరిస్థితులు:—ప్రకృతపు వ్యవహారముతో సంబంధించిన హంపిస్వామియొక్క (సచ్చిదానందాభినవోద్దండ విద్యారణ్య భారతీస్వామియొక్క తత్త్వమునాకంత లోకమునకు రైదుంగ వలసియున్నది. ఈతడు కృత్రిమసన్యాస పరంపరలో పన్నుట యటుండ నీతనికి నేటికినిమిది వత్సరముల యీవలనే పూర్వాపు హంపిసన్యాసి దానుచన్నునపుడుసన్యాసముం జేయించి తలగొరిగించి జందెము త్రెంపించి కావిగుడ్డలం గట్టించి పీఠముపైం గూర్చుండంబెట్టిన విషయము లోకమునకొక వింతగాదు. దానంజేసి యీతడు పేరుపెద్ద యూరుదిబ్బ యనులోకోక్తికి వన్నెదెచ్చు నట్లొక పరివ్రాజకబ్రువుడుగాని వేరొకడెంతమాత్రమునుగాడు. పరివ్రాజకబ్రువుడే కాక చక్కని పరివ్రాజకుడే యైనచో మహనీయులగు శ్రీబోధానంద భారతీస్వాముల

వారి యందు నసూయఁజెందుట యటుండ రాజమండ్రి డిస్ట్రిక్టుకోర్టులో నారూఢ పతితుడనియు భారతీసాంప్రదాయపు వాడుగాడనియును నిర్ధారణ సేయఁబడినట్టి పకోడీస్వామికిని, సర్వవిధముల దత్తుల్యుడునుఁ దదనుంగు చెలికాడునగు కనకదండి స్వామిని పరిగ్రహించి పట్టాల నిచ్చుటచేతను వారల సర్వవిధముల గౌరవము చేయుటచేతను, హంపిసన్యాసి యొక్క యోగ్యత యీసన్యాసుల యోగ్యతతోఁ దుల్యముగ నలరారునట్లు బుధులెల్లరును గ్రహింపఁగలరు. దానంజేసి హంపిపీఠపు సన్యాసియు నొక పరివ్రాజకబ్రువుడేయనుటకు సందియమించుకేనియు లేదు.

డిక్రీ:—ఈదావాలో డిస్ట్రిక్టుమునసబుగారి యొక్క డిక్రీలోని విషయము న్నది యున్నటుల నుదహరింపఁ బడుచున్నది.

" Suit to declare that the plaintiff is the head (అధికారి) of the Abhinava Virupaksha peetham and spiritual ruler of all the Smartas living in the country from Ellore to Sri Jagannadham and to obtain a perpetual injunction restraining the first defendant from exercising such authority and from recovering Bhikshas and presents from people and to recover the scheduled property with costs and other reliefs.— value of claim Rs. 310.

Decree:—The cause coming on Thursday 16—10—13................ and having stood over for consideration till this day, this court doth order and decree that plaintiff do pay defendants their costs of suit and bear his own costs. Plaint schedule is hereto attached. "...................................................

Given under my hand and seals of the court this 2nd. day of June 1914 (Sd) A. Narayana, District Munsiff.

రాజమండ్రి సొపరరినబార్డీనేట్ జడ్జికోర్టులో అప్పీలు:—

A. S. NO. 5 of 1915 / A. S. NO. 234 of 1914 } పైదావాలో కనకదండిస్వామి పరాభవము చెందుటయటుండ నైజామురాష్ట్రపు టడవులలో నింతవఱకు మేకపోతు గాంభీర్యముతోఁ జరింపుచున్న హంపిపీఠపు బండారము బయల్పడినది. అయ్యాది దొంగపీఠమనియు నందుండు సన్యాసులు కృత్రిమ వేషధారులనియు లోకమునకు వెల్లడియైనది. అందుపైవారలు దమపరపతికి భంగముగలుగునని తలచి కనకదండిస్వామికి దండిగ మదుపుబెట్టి యప్పీలునుఁ జేయించి తమశక్తివంచనలేకఁ బాటుపడిరి. ఏదియెట్టులై

నను "యథామూషిక మూషికః" అను న్యాయమున తనువుగ కనకదండిస్వామి కనకదండిస్వామియే. హంపిపీఠము హంపిపీఠమే. అప్పీలుపోవుట యటుండ నుభయ పక్షముల ఖర్చులును గనకదండిస్వామియే భరింపవలసి వచ్చెను. అట్టిడిక్రీయందలి ప్రధాన విషయములిందు పొందికపరచఁబడుచున్నవి॥

Appeal from the decree of the Court of the District Munsiff of Rajahmandry, dated 2nd. day of June 1914 in original suit 127 of 1912........................................

Decree:—This Appeal coming for fiinal hearing on Wednesday .........................the 2nd, 3rd and 4th days of August 1915 before M. R. Ry. T. Rajarama Roa Avl. B. A., B. L., Additional Temporary Subordinate Judge in the prsence of Messrs........................................ and having stood over till this day for consideration this court doth order and decree that the decree of the lower court be and the same hereby fs confirmed and this appeal dismissed with costs. The costs of this appeal amounting to Rs 76—6—5 are to be borne by the appellant who will pay the costs of the 1st. respondent amounting to Rs 20—8—0 and the costs of the 2nd. respondent amounting to Rs 0—8—0.........................

Given under my band and seal of the court this 6th day of September 1915.

(Sd.) T. Rajarama Roa,
Subordinate Judge.

ఫలితము:—ఇట్లు బోధానంద భారతీస్వాములవారిపై దొంగసన్యాసులెల్లరచేఁ జేయఁబడిన నభియోగములన్నియునుఁ జల్లారఁ నప్రతిహతంబుగ శ్రీబోధానంద భారతీస్వాములవారు శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠము (అభినవ విరూపాక్షమఠము 6th Madras 1883) నందు జగద్గురుత్వ సామ్రాజ్యమునుఁ జేయుచు హంపిపీఠపు దుండగముల నడంప నైజాంరాష్ట్రమునకుఁ బోవుచు మధ్యను బెజవాడ గ్రామములో 1915వ వత్సరమున నిలచిరి, అచ్చటిభక్తులెల్లరును వారల నిరుపమానముగ సేవింపుచుండిరి. అట్టితరుణమున హంపిసన్యాసివిని సహింపఁజాలక బెజవాడగ్రామస్థులకు దాను పీఠాధిపతిననియు శ్రీబోధానంద భారతీస్వాములవారినిఁ బూజింపఁ గూడదనియు నొక శ్రీముఖాభాసమునుఁ బంపెను. అద్దానిపై వారలు శ్రీబోధానంద భారతీస్వాములవారికడనుండు పత్రములఁజూచి యథార్థమునుఁ దెలిసికొని వెంటనే యొక మహాజరును 146 సంతకములతో హంపిసన్యాసికిఁ బంపిరి. అద్దాని సారాంశము శ్రీబోధానంద భారతీస్వాములవారే తమకు గురువులును శాసకులనియు హంపిపీఠము

తోఁ దమకెట్టిసంబంధమును లేదనియును. అద్దానికి హంపిసన్యాసి దొంగకు తేలు కుట్టినట్లులుకు వలుకులేక మిన్నకుండెను. పిమ్మట శ్రీబోధానందభారతీస్వాములవారు 1916 జనవరి నెలలో సికిందరాబాదు పురంబునకు విజయంచేసిరి. అక్కడికి హంపి స్వామి తిరుగ నొక శ్రీముఖాభాసముతో నిద్దరు బ్రాహ్మణుల దనప్రచారముకొఱ కంపెను. అంతసికిందరాబాదు పురమున గలవరముగల్గెను. అంతపురమందలి విద్వజ్జన మహాజనులందరు సమావేశమై యొకసభగావించిరి. ఆసభయందు సకల విషయములు చర్చింపఁబడి హంపిపీఠము కల్పితపీఠమనియును శ్రీబోధానంద భారతీస్వాములవారే వాస్తవమగు విరూపాక్ష పీఠాధ్యక్షులనియును నిర్ధారణ సేయఁబడి సభ్యులయనుమతిపై లోకమునకు యథార్థము వెల్లడియగునటుల శ్రీశివపురవు వీరభద్రపాకయాజియును నాగం క్రిష్ణారాయశర్మయును శ్రీవీర సంగ్రహాచారిత్రమను పొత్తమునురచించి యచ్చొత్తింపించి ప్రకటించిరి. అద్దానిని హంపిసన్యాసి చూచి తన్మూలకముగఁ దనదొంగతనము లోకమునకు వెల్లడి యగునని యెంచి మేకపోతుగాంభీర్యమును జూపుచు గ్రంథకర్తలపై యభియోగ మునుఁ దెచ్చెదనని బెదరింపుచు నొకన్యాయవాదిద్వారా యొకపత్రిక నంపించిరి. అందుపై గ్రంథకర్తలిరువురును దాము వెల్లడించినదంతయు నిజమేయనియును లోక సంగ్రహమునకై వెల్లడించితిమనియు హంపిసన్యాసి యంతటితో నూరకుండిన దన మర్యాద యొకింతయైన దక్కుననియు లేనిచో నభియోగమున నింకను మర్యాద పోవుట యటుండ హంపిసన్యాసి సింగపుతోలుగప్పికొనిన యొకగాడిదతోఁ దులతూగు పరివ్రాజకప్రభువని లోకమునకింకను సుకరముగ దేటపడగలదనియునుఁ బ్రత్యుత్తరము నీయ హంపిసన్యాసియునుఁ దదనుచరులును నోరుమూసుకొని నేటివరకు నూరకుండుటయేకాక నైజామురాష్ట్రమున మూలమూలల గుప్పిగంతులు వైచుచు గాలక్షేపమునుఁ జేసికొను చున్నారలు.

హంపిసన్యాసికి బహిష్కారము:— ఇట్లు హంపిసన్యాసి దుండగములఁ జేయుచుండ నట్టిదుండగముల వారించి యమాయకపు ప్రజల గాపాడుటకై జగద్గురు శ్రీబోధానంద భారతీస్వాములవారు 1916 వ సంరమున నొకబహిష్కారశాసనము గూడ నంపించి యున్నారలు. అద్దానికిఁగూడ హంపి సన్యాసిమౌనముద్ర ధరియించి మిన్నకుండెను.

జగద్గురు శ్రీబోధానంద భారతీమహాస్వాములవారి ప్రచారము:— ఇట్లు శ్రీబోధానంద భారతీస్వాముల వారప్రతిహతంబుగ తుల్జాపురము పంఢరాపురము

మొదలగు మహారాష్ట్రప్రదేశములను బళ్ళారి, కర్నూలు మదరాసు మున్నగు ప్రదేశములందు యాత్ర జేయుచు దమ విద్యావైభవాతి శయములచే భక్తవర్యులకు ధర్మోపదేశంబులు సలుపుచు శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధిపత్యము నప్రతిహతంబుగ 1923 డిశంబరు 28వ తేదీవఱకు జరపి యాదినమున దమప్రియాంతేవాసియగు శ్రీకల్యాణానంద భారతీస్వాములవారికి గుంటూరుపురమున నశేషవిద్వజ్జన సమక్షము సకల శాస్త్రీయ మర్యాదలతో సాంమ్రాజ్యాభిషేక పురస్సరంబుగ నప్పగించి విశ్రాంతి జెందిరి. ఇయ్యది శాంకర శకము 2432 వ వత్సరము మార్గశీర్ష పూర్ణిమా భానువాసరము.

జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమహాంతాచార్య స్వాములవారు:—శాంకర శకము 2432వ వత్సరము మార్గశీర్ష పూర్ణిమా భానువారమునకు సరియైన 1923 డిశంబరు 23వ తేదీ నుండియు జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమహాంతాచార్య స్వాములవార ప్రతిహతంబుగ శ్రీపీఠాధీశ్వరత్వమును జేకొని వైదికధర్మ సంగ్రహామునకై పలువిధములగు సన్మార్గముల నుపదేశించుచు నవ్వాని నాచరణంబునకు దెచ్చుటకై చాతుర్వర్ణ్య శిష్యబృందములకును బలువిధంబుల బలుతావుల బ్రబోధమును గల్గించుచున్నారలు. ఇయ్యది భారతీసాంప్రదాయమునకు బ్రధాన నిలయమగు శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠ ప్రస్తావము.

శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠపు రాష్ట్రము:—శ్రీవిరూపాక్ష శ్రీపీఠమున గడచిన నూటయిరువది వత్సరముల చారిత్రమునుబట్టి యియ్యది యుత్తర సర్కారులలోనే యుండిపోవుటచేతను విరూపాక్షశాస్త్రీయను బ్రాహ్మణాధముడు సేసిన దుర్మార్గముచేతను లోకులేమి పీఠమునధిష్ఠించిన పీఠాధిపతులేమి క్రమక్రమముగా నైజస్థితిని మరచుటచేతను నియ్యదియొక యొకక్రొత్తపీఠమనియును దీనికి నభినవ విరూపాక్షమఠమని నామమనియును నుత్తరసర్కారులందు దక్క వేరొక ప్రదేశమున నధికారమీపీఠమునకు లేదనియు నొకప్రవాద మధ్యారోపమునేయబడి యుండెను. ఇదియంతయును భ్రాంతిమూలకము. ఈపీఠపు పరిస్థితుల నామూలాగ్ర మొకింత యోజించిన నీపీఠపు అధికారము సుస్పష్టముగ దెలియగలదు. ఈ పీఠము జగదేకగురువులగు శ్రీవిద్యాశంకర విద్యారణ్యులవారి పవిత్రస్థానము. శ్రీ విద్యారణ్యులవారన్నో యలంకముగ నేకచ్ఛత్రాధిపత్యము గావించినటుల నెల్లరకును దెలియవచ్చిన విషయమేకద! వారియనంతర మీపీఠము వారిశిష్యులగు నృసింహ భారతులచే నలంకరింపబడెను. వారలట్టి మహాదధికారమును బడసి యున్నటుల

చెక్కులు నిదర్శనములు గలవు. వేయేల విద్యానగరము తురకలచే నిర్మూలము సేయఁబడువరకు నాపుర మెంతటి రాజధానిగ నొప్పెనో యంతకంటె నెక్కుడతిశయముతో శ్రీపీఠాధీశ్వరులతిశయమును గాంచిరనుటకు సందియ మెంతమాత్రమును లేదు. ఇఁక శాంకరశకము 2303 (క్రీ॥ శ. 1794) మొదలు నుద్దండ తేజముతో నొప్పిన యుద్దండభారతుల కాలమున వారిచే శాసనాధికార ప్రయుక్తముగ సంచరించిన దేశమునుఁ బరిశీలించినచో నీపీఠాధీశ్వరు లప్పటివఱకు నాసేతు సీతనగమ ప్రతిహతమగు నధికారమును నెరపినట్లు సుస్పష్టము. ఇఁక నుద్దండ భారతుల నిర్యాణముతో నీపీఠపు రాష్ట్రమభిభవముజెంది క్రమక్రమముగ శా. శ. 2392 (1883 క్రీ. శ.) సంవత్సరమున మదరాసు హైకోర్టువారిచే నానుషంగికముగ నుదహరింపఁబడిన యుత్తర సర్కారులు రాష్ట్రముగా గల్గియున్నటుల సకలలోక విదితము. ఏది యెట్లైన నియ్యది యొక శాసనాధికార ప్రయుక్తమగు జగద్గురు పీఠముగా గౌరవమును మాత్రము బడయుచున్నది. దైవవశముచే నిట్టిపరిచ్ఛిన్నభావము దొలగి పుష్కలమగు యశంబు వడయుకాలముగల్గి జగద్గురు శ్రీబోధానంద భారతీస్వాములవారు మండపేటయందు శ్రీపీఠము నధిష్ఠించిరి. పిమ్మట నద్దానికి నసూయజెందిన దుష్టపరివ్రాజకుల దుండగములచే నేమి పరమేశ్వరానుగ్రహముచే నేమి యుద్దండభారతుల యనంతరము విరూపాక్షశాస్త్రిచే నపహరింపఁబడిన కాగితములు దొరకుట చేతను శ్రీపీఠసన్నిధియందు నిలచియున్న ప్రాచీనపు పత్రముల విచారించుటచేతను వ్యాధకులసంవర్ధితరాజకుమార న్యాయమున నీయుత్తరసర్కారులు ప్రధానరాష్ట్రముగాఁ దలంచఁబడుచుండెడి శ్రీపీఠరాజమే శ్రీవిద్యాశంకర విద్యారణ్యులవారిచే శ్రీవిద్యానగరమున బ్రతిష్ఠింపఁబడిన పీఠరాజమని వెల్లడిగాగ జగద్గురు శ్రీబోధానంద భారతీస్వాములవార ప్రతిహతముగ శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురువులనియును ఆసేతు సీతనగవ్యాప్తమగు రాష్ట్రమీ పీఠరాజపు రాష్ట్రమనియునుఁ దదితర పీఠములన్నియు నీపీఠరాజమునకు శిష్యపీఠములనియు నయ్యాపి నియమితస్థలములందు మాత్రతే యధికారము గల్గియున్నవనియు, సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నయది. ఇంతియకాదు. ఈపీఠరాజమునందు మాత్రమే జగద్విఖ్యాత యశంబువడసిన భారతీ సాంప్రదాయ మింతవరకు నవిచ్ఛిన్న పారంపర్య క్రమమున నలరారుచున్నయది.

ఇతి నారాయణ స్మృతిః॥

---

27115
25.3.73

## —: హంపి పీఠము :—

శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠపు ప్రస్తావమున హంపిపీఠపు ప్రస్తావము విపులముగ నుదహరింపఁబడుచు వచ్చెను. అద్దాని తత్త్వము పుష్కలముగఁ దెలియఁబడిన గాని శ్రీపీఠరాజపు మహిమాతిశయంబులు పుష్కలముగఁ దెలియఁబడుట దుర్ఘటము గావున నద్దాని స్వరూపము సంక్షేపంబుగ నుదహరింపఁ బడుచున్నది. హంపిపీఠము హంపివిరూపాక్ష పీఠమను వ్యవహారమునుఁ గాలక్రమంబునఁ జెందుటచే నిది యొక విరూపాక్ష పీఠమనియు నిత్యాదియు విద్యారణ్య ప్రతిష్ఠితంబగు విరూపాక్ష పీఠముతో సంబంధించిన దేయనియు, నొకభ్రమకు గారణము గలుగుచుండును. ఇంతియె కాదు. ఇత్యాది యే విద్యారణ్య ప్రతిష్ఠితంబనియు, నాపీఠమును ద్రిప్పుచుండు దుండగీడులు వలుకుటయును, నద్దాని పామరులు విశ్వసించుటయును గలుగుచున్నయది. దానంజేసి యనర్థము వాటిల్లుచుండు నట్టియనర్థమీదిగువ నుదహరింపఁ బడు విషయంబులచే సుకరముగ దొలగి యాథార్థము దెలియగలదు. శ్రీవిద్యారణ్య ప్రతిష్ఠితంబైనది విరూపాక్షపీఠ మొక్కటియే కాని, వేరొకటి తెలియరాదు. హంపి యనునామమే శ్రీముఖములందును, విద్యారణ్యులవారితో సంబంధించినంత వరకు దెలియరాదు. హంపియను స్థలమున నేమహనీయులు నెట్టిపీఠమును స్థాపించినటుల నెక్కడను నేరికిని దెలియవచ్చుటలేదు. శృంగేరీ శ్రీవిరూపాక్షపీఠమునుచో శృంగేరీ శబ్దమునకుఁ గల సరసతవంటి సరసతనీ హంపిశబ్దమెచ్చటను బడయనేఱకపోవుట యటుండ నాపీఠమును రొంపిలో ముంచునంతటి యపార్థమునుఁ గూడ గలుగఁ జేయుచున్నది. రఘోబా పీష్వాగారి కాలమునుండియు నీపీఠము హంపిపీఠమనియే పిలువబడుచున్నది. కాని విరూపాక్షముతో నెంతమాత్రము సంబంధమును గల్గియున్నట్లు దెలియరాదు. ఇక విరూపాక్షపీఠముతో నీపీఠమునకు గలసంబంధము తెలియవచ్చినంతవఱకు నీహంపిపీఠ మొక కృత్రిమ పీఠమై బహిష్కృత పీఠముగాఁ దెలియవచ్చుచున్నయది. ఇట్టిపరిస్థితు లీక్రిందివిషయములవలన స్పష్టమగును.

౧. శ్రీవిద్యాశంకర విద్యారణ్యులవారిచే విరూపాక్షక్షేత్రమునఁ బ్రతిష్ఠింపఁబడినట్లు రేణుకాసంత్రమున నుదహరింపఁ బడిన యష్టనాగేభ పీఠయుతంబగు శ్రీచక్రరాజముగాని చంద్రమౌళీశ్వరుండుగాని హంపిపీఠమునఁ గానరావు. అచ్చటనెం

తమాత్రమును లేవు.

౨. విద్యారణ్యపీఠమునకు ముఖ్యపత్రములగు బుక్కభూపాలుని బహూమానపత్రము, పుష్పగిరి మఠస్థులు వ్రాసియిచ్చిన యొడంబడిక మొదలుగాగల యధికారపత్రములు సర్వవిధముల దమహస్తములో నుండగనే యవ్వాని నేరికిఁ జూపకయు, జూపించినను బ్రయోజనము నెంతమాత్రమునుగనకయు నైజాంరాష్ట్రపు టడవులలోని యమాయకపు ప్రజల మోసబుచ్చుచుఁ గాలము వెళ్ళించుకొనుట.

౩. పుష్పగిరి మఠమువారు శృంగేరీ శ్రీవిరూపాక్షపీఠమునకు వ్రాసియిచ్చిన యొడంబడికనుఁ జేకొని పుష్పగిరి వారిని గప్పమునకై తకరరుసేయు వారివలనఁ దమదొంగతనములోకమునకు వెల్లడిగాగ నద్దాని సమర్థించుకొనలేక నచ్చటచ్చట ద్రవ్యామిషలో భంజన చేసిన ప్రమాణంబులు వ్రాసిన ప్రమాణపత్రికలును.

౪. పుష్పగిరి వారితో వివాదమునకుఁ గడంగి ప్రతిజ్ఞాపత్రమును వ్రాసియిచ్చి యద్దాని నిర్వహించుకొనలేక పోవుటయటుండ వారలను బ్రతిమాలుకొన యత్నించి పరాభూతులగుట.

౫. తుల్జాపూరు పంఢరాపురము మొదలగు స్థలంబుల పరాభవముఁజెంది దేవళంబుల స్వాధీనము సేసికొనలేకపోవుట.

౬. శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వరులు తుల్జాపూరు మొదలగు స్థలములకు వ్రాయించి యంపించిన శ్రీముఖములు,

౭. 1912 వ సం॥రపు రాజమండ్రిడిష్ట్రిక్టు మునసబుకోర్టు హసలుదావా నెం 127 రు యొక్కతీర్పు

౮. 1915 సం॥ రమున రాజమండ్రి సబార్డినేటు జడ్జిగారు వ్రాసివేసిన అప్పీలు.

౯. 1916 సం॥రమున బెజవాడ విద్వజ్జన మహాజనులు హంపి పీఠమునకుఁ బంపించిన మహజరు.

౧౦. సికందరాబాదు నివాసులగు శివపురపు వీరభద్రపాక యాజి నాగం క్రిష్ణారాయ శర్మగార్లు ప్రకటించిన శ్రీ పీఠసంగ్రహ చారిత్రము,

౧౧. శ్రీ పీఠసంగ్రహ చారిత్రమునుఁ బ్రకటించినందులకై గ్రంధకర్తలపై మానహానికి నభియోగము దెచ్చెదమని బెదరింపుచు నిప్పించిన వకీలు నోటీసుపైని

గ్రంథకర్తలిచ్చిన ప్రత్యుత్తరమునకుఁబుష్కల మౌనభావము (Estoppel)

౧౨. జగద్గురు శ్రీ బోధానంద భారతీ మహాస్వాములవారు నైజాం రాష్ట్రమున సంచారము సేయునప్పుడు గంగ వెఱ్ఱులచే నెత్తిన పరుగులు,

౧౩. జగద్గురు శ్రీ బోధానంద భారతీ మహాస్వాములవారిచేఁ జేయఁబడిన బహిష్కార శాసనమునకు మూకీభావము. (Estoppel)

౧౪. జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహాచార్య స్వాములవారు శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీ పీఠాధిరోహణము సేసినదిమొదలు నేటివఱకును హంపి పీఠముపైఁ జేసినయధిక్షేపములకు హంపిసన్న్యాసి దాల్చిన నమ్రభావము. (Estoppel)

ఇట్లుఁ బలువిధములగు కారణములచేఁ బ్రకృతమున నైజాము రాష్ట్రమున నట్టహాసముతోఁజరింపుచున్న హంపి విరూపాక్షపీఠమను నది పీఠాభాసమగు కృత్రిమ పీఠముగాని వాస్తవపీఠ మెంతమాత్రమునుఁగాదు. అందుండు సన్న్యాసులు దొంగసన్న్యాసులుగాని శ్రుతిస్మృతి సదాచార సాంప్రదాయముచే నలరారు భారతీసాంప్రదాయపు సన్న్యాసు లెంతమాత్రమునుగారు. ఈ పీఠాభాసమునకు ననదొంగ పీఠమునకు మూల పురుషుఁడు క్రీ. శ. 1792 ప్రాంతమున విరూపాక్షక్షేత్రమున నుద్దండ భారతులు లేని కాలమున నుద్దండ భారతులయొక్క గురువులు శ్రీవిద్యారణ్య భారతులు సిద్ధిపొందిన పిదప నచ్చటఁ జేరి యుండిన శవదగ్ధ బ్రాహ్మణాధముఁచే సన్న్యాసివేషము వేయింపఁబడిన ఘోటక బ్రహ్మచారి. అట్టి దొంగ సన్న్యాసికి నభినవశంకర భారతియను నామ మిడిరి. ఉద్దండ భారతులా సన్న్యాసిని వెడలగొట్టి పీష్వా రగోబా బాజీరావుగారి మనవిపై తెలాంగానాయందు పీఠప్రయుక్తాధికారము లేకుండ బిచ్చమెత్తుకొని జీవింపననుజ్ఞ నిచ్చిరి. ఆదొంగ సన్న్యాసిని లేవనెత్తిన బ్రాహ్మణాధములు ఆదొంగ సన్న్యాసికి ననంతరము మఱియొక దొంగసన్న్యాసిని తదనంతరము మఱియొకని నిట్లు గ్రమక్రమముగ నొక కృత్రిమభారతీ పరంపరనుఁ బెంచుచు నేటివఱకు నొక పీఠాభాసమును నైజాంరాష్ట్రపుటడవులలో నభివృద్ధిసేయు చున్నారలు ఇట్టి దొంగ పీఠమున జరుగుచుండెడి దుర్న్యయము లడవులలో దాగి యుండుటచే సర్వజన విదితములు గాక పోవుట యటుండ దూరపు కొండలు నునుపను లోకోక్తి వన్నె మీఱనీ దొంగ పీఠమును పీఠముగ జనులు పరిగణించుట తటస్థమై పెక్కులు ధర్మవిప్లవ కారణములకు నీ దొంగపీఠము నిలయమగు చున్నయది. జగద్గురు శ్రీ బోధానంద భారతీ మహా

స్వాములవారు శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీపీఠము నధిష్ఠించియున్న కాలమున నీహంపి పీఠముననుండిన సచ్చిదానందాభినవోద్దండ విద్యారణ్య భారతియను దొంగ సన్యాసి పకోడీస్వామిని కనక దండిస్వామిని లేవనెత్తి ధర్మవిప్లవము గావింపదలచె, అట్టి ధర్మ విప్లవమును సహింపఁజాలక నాపరమేశ్వరి హంపి పీఠపుగృత్రిమస్థితిని శ్రీ పీఠపుటతిశయమును లోకమునకు వెల్లడి జేయునభియోగముల దెప్పించెనాయనునటుల నభియోగములన్నియును శ్రీ పీఠపుటభ్యుచ్ఛ్రయమునకుఁ గారణములయ్యె. ఇది యట్లుండ పైనుదహరింపఁబడిన సచ్చిదానందాభినవోద్దండ విద్యారణ్యభారతియనుదొంగసన్యాసి 1924 వ సం॥ రం ఆగష్టు నెలలోఁగాల ధర్మము నొందుచు దనకు సోదరుడును దివానుగా నటింపు చుండిన పామిడి లక్ష్మీనరసప్పయను నాతని కుమారుడగు చిన సుబ్బప్పయను పండ్రెండు సంవత్సరముల వయస్సుగల బాలునకప్పటి కప్పుడు సన్యాసమునుఁ జేయించి వెంటనే తలగొరిగించి జందెము ద్రెంపించి కాషాయాంబరముల గట్టించి హంపి పీఠమున నిలపి కాలధర్మము నొందెనట, ఇదియంతయు మూడురోజులలో ముగిసెనట. ఇట్టి పిల్ల సన్యాసి వేషధారుడగు దొంగ సన్యాసి యితఃపూర్వపు హంపి సన్యాసుల మర్యాదను లోకమునకు వెల్లడిచేయుచు నైజాంరాష్ట్రమున నాపదగ్ధ బ్రాహ్మణాధములచే సింగపుతోలు గప్పబడిన గాడిదవలె త్రిప్పబడుచు నచ్చటి బ్రాహ్మణాధముల జీవికకుపచరింపుచున్నాడు, ఇయ్యాదిహంపి పీఠపుతత్త్వము ఈ హంపి పీఠపు పిల్ల సన్యాసి శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు భారతి నామాంతమాత్రము గాక దొంగ సన్యాసియని బుధులు గుర్తెంగినవ్య వహరింపవలయును, ఇతి నారాయణ స్మృతిః

---

## శృంగగిరిపీఠము.

శ్రీవిద్యాశంకర విద్యారణ్యులవారు శాంకరశకము 1840 (క్రీ. వె. 1331)వ వత్సరమున శృంగగిరిపీఠము నధిష్ఠించిరనియుఁ బిమ్మట 1845 (క్రీ. వె. 1336) వ వత్సరమున శ్రీవిద్యానగరమును శ్రీపీఠరాజమునుఁ బ్రతిష్ఠించి తాము శ్రీవిద్యానగరమున నివసించియుండుటచేఁ దమశిష్యులగుఁ జంద్రశేఖరభారతుల శృంగగిరి పీఠమునఁ దమకుఁ బ్రతినిధిగ నియమించిరనియు నిదివఱకు నుదహరింపఁబడియె. దానంజేసి

శృంగగిరి యొకయుపపీఠముగా బరగుటయు నచ్చటగూడ భారతీసాంప్రదాయ మభి వృద్ధి సెందుటకుగూడ నవకాశముండుటంజేసి యచ్చటి భారతీసాంప్రదాయపు పరిస్థితుల నొకింత నిరూపించుచున్నారము. విద్యారణ్యులవారిచేఁ బ్రతినిధిగ నియమింపఁబడినఁ జంద్రశేఖర భారతులు శా॥ శకము 1898 (క్రీ. శ. 1389 వత్సరమున సిద్ధినొందెను. అప్పటికి విరూపాక్షపీఠమున నన శ్రీవిద్యానగరమున నృసింహభారతుల ఖండపీఠాధిపత్యమునుఁ జేయుచుండెను. చంద్రశేఖర భారతులు సిద్ధిపొందినపిదప 17 సంవత్సరములు ప్రతినిధి శృంగగిరియందున్నట్లు దెలియరాదు. పిమ్మట నృసింహభారతులు విరూపాక్షమున సురేంద్రభారతుల నుభయ పీఠాధ్యక్షులుగను, పురుషోత్తమ భారతులను శృంగగిరి యందుఁ బ్రతినిధిగను శాం॥ శ॥ 1917 (క్రీ. శ. 1408) వత్సరమున నియమించియు పరపతిజెందెను. ఇతఃపరము విరూపాక్షపీఠమున సురేంద్రభారతుల పరంపర శృంగేరీ శ్రీవిరూపాక్ష జగద్గురు పరంపరగను, పురుషోత్తమ భారతుల పరంపర శృంగగిరియందు ప్రతినిధి పరంపరగను నభివృద్ధి నొందుచున్నటులఁ గొంతవరకు నూహింపవచ్చును. ఇంతియకాదు. విరూపాక్షమునుండి శృంగగిరికి ప్రతినిధులఁ బంపుచుండినటులఁ బెక్కు నిదర్శనములు గానవచ్చెడిని. ఇట్లువచ్చుచుండ విరూపాక్షపీఠస్థులు సుమారు నూటయేబది వత్సరములకుఁ బూర్వము శృంగగిరికి నియమితదేశమున సంచారముచేయుచు పీఠపరిపాలనము సేసికొనునటుల నధికారము నొసంగిరి. నాటంగోలె శృంగగిరి పీఠమత్యద్భుతమగు వికారములకు లోనై క్రమక్రమముగ నేటికి భారతీసాంప్రదాయ శూన్యమై హంపిపీఠమునకు బోలె నొక కృత్రిమ భారతితో నలంకరింపఁబడి యున్నదని వ్రాయుటకు నెంతియు విచారము గలుగుచున్నయది. క్రీ. శ. 1868 సం॥ రమున నొక తొమ్మిది వత్సరముల బాలుడుపనయనము సేయఁబడిన కొలదిదినములలోనే సన్న్యాసమిప్పింపఁ బడినప్పటికిని సన్న్యాసము నిప్పించిన స్వాములవారు స్వస్థతఁ జెందుటంజేసి యాబాల సన్న్యాసి క్రీ. శ. 1879 వ వత్సరమున పీఠమునకు నభిషిక్తము సేయఁబడెను. ఈతనిపేరు సచ్చిదానంద శివాభినవనృసింహభారతులు. ఈతను క్రీ. శ. 1912 వ వత్సరమునఁ జైత్రమాసమున గాలధర్మము నొందెను. వీరుగాలధర్మము నొందువఱకు వీరికడను నెవ్వరును శిష్యులులేరు. పిమ్మట నచ్చటనుండు బ్రాహ్మణులు సుమారు 19 వత్సరముల ప్రాయముగల మురికినాటి యజుర్వేద బ్రహ్మచారి నొకనిదెచ్చి సన్న్యాస

మిప్పించి సన్న్యాస ప్రయుక్తోపదేశము మొదలుగాగల సాంప్రదాయ సంస్కారములు
లేకుండగనే చంద్రశేఖర భారతియను నామాలా కృతుని జేసి శృంగేరీ పీఠము నధి
ష్ఠింపఁ జేసిరి. ఈసాంప్రదాయ రహితుడగు కృత్రిమభారతి నేడు శృంగగిరి పీఠమునఁ
దెలియవచ్చుచున్నాడు.

ఇఁక నీపీఠమునందలి విశేషవిషయము లొకింత సంక్షేపంబుగఁ బ్రదర్శింపఁ
బడుచున్నవి.

విరూపాక్ష పీఠాధీశ్వరులచే శృంగగిరిపీఠమునకు దేశవిభాగము సేయఁబడు
వరకును శృంగగిరియందలి భారతులు విరూపాక్ష పీఠాధీశ్వరులకుఁ బ్రతినిధులుగనే
వ్యవహరింపుచుండిరి. పిమ్మట శృంగగిరియందలి పరిస్థితులు పుష్కలముగ మారినవి.
పీఠమునకు భారతీసాంప్రదాయపు పరమహంస పరివ్రాజకులకుమారుగ గొందరు శాప
దగ్ధబ్రాహ్మణులు సర్వాధికారులైరి. దానంజేసి యచ్చట భారతీ సాంప్రదాయము
సర్వవిధముల దుడిచి వేయబడినది. అట్టి దుర్మార్గములు విబుధలోకమున కెట్టులభాసిం
పుచున్నను వానితత్త్వ మాబ్రాహ్మణాధములచే గప్పివేయబడినది. అద్దానియొక్క
పర్యవసానమే ప్రకృతము శృంగగిరిపీఠమునఁ దెలియవచ్చెడి చంద్రశేఖరభారతియొక్క
కృత్రిమభారతీత్వము. ఈతడు కృత్రిమభారతియని ముల్లోకవిదిత మేకద! ఇంతియ కాదు.
శృంగగిరిపీఠాధిపత్యమున కధికారిగ మురికినాటి యజుర్వేదశాఖీయ బ్రహ్మచారిదక్క
వేరొక రెంతమాత్రము నధికారులుగారట. అట్టిమురికినాటి బ్రహ్మచారికితరుణమును
బట్టి ముండనము సేయించి జందెమును ద్రెంపించి కాషాయాంబరములగట్టించి దండ
ధరుని జేసి నంతమాత్రమునసె శృంగగిరిపీఠమున భారతీసాంప్రదాయపు సన్న్యాసియగు
టయేకాక నఖిలభారతభూమికిని నద్వైతమతప్రవర్తకాచార్యుడగు జగద్గురువగునట.
ఇట్లు జగద్గురువులుగ బ్రకటింపఁబడు పరివ్రాజకప్రభువులు ఆయాయిమఠములందలి
సర్వాధికారులగు బ్రాహ్మణాధముల చేతులలోకీలుబొమ్మలట్లు జరింపుచుండుటదక్క
వేరొకవిధముసఁ బరగకునికి భారతీయు లెంతవిచారము నొందవలయునో భగవంతు
డెరుంగుగాక! ఉదుంబరఫలోపమంబుగభాసింపు శృంగగిరిపరిస్థితుల నచ్చటి సర్వాధి
కారులుగప్పిపుచ్చి లోకమును వంచింపుచున్నారలు. శృంగగిరిపీఠము భారతీసాంప్ర
దాయశూన్యమైనదని వేర జెప్పనక్కర లేదు. వేయేల శృంగగిరియందునే సాంప్రదా
యపు సన్న్యాసి తెలియరాకుండుట యటుండ సింగపుతోలుగప్పిన గాడిదవలె నొప్పు

కృత్రిమభారతి యొక్కడుమాత్రము దెలియవచ్చుచున్నాడు.

ప్రాజ్ఞు లిట్టి ధర్మవిప్లవమునుండి వైదికధర్మమునుగాపాడ చక్కనియత్నములు సేయకపోయినచో వైదికధర్మ మచిరకాలములో నడుగంటుననుటకు సందియము లేదు. కావున ప్రాజ్ఞులీశృంగగిరిపీఠమున శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు భారతీసాంప్రదాయమును నెలకొలుపుదురుగాక! ఇయ్యది శృంగిగగిరిపీఠపు భారతీ సాంప్రదాయపు ప్రస్తావము. ఇతి నారాయణస్మృతిః

## పుష్పగిరి మఠము.

పుష్పగిరి మఠము మొట్ట మొదటినుండియు శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠమునకుఁగప్పముఁ జెల్లించు చుండిన మఠమని యిదివఱకుఁజెప్పంబడియె. అక్కడకు నప్పటప్పట విరూపాక్షాధీశ్వరులచే సన్యాసులు నియమింపఁబడి పంపించఁబడుచుండెడివారలు. క్రీ వె. 1565 వ సం॥రమున విరూపాక్షమునకుఁగల్గిన దుర్దశచే 1566 నుండి యొక ప్రత్యేకమఠముగ వ్యవస్థచేయబడి నిర్ణీతస్థలములందు సంచారముచేయుచు నిర్ణీతమగు గప్పము గట్టినట్లు శ్రీపీఠాధీశ్వరులచే యేర్పాటు చేయఁబడెను. నాటంగోలె పుష్పగిరి మఠముగూడ భారతీ సాంప్రదాయమునకు బ్రత్యేకపు నిలయమై క్రమక్రమముగా క్రీ వె. 1800 సంవత్సరమునకు శృంగగిరి పీఠమట్లు మురికినాటి శాఖకుఁ జెందిన శాపదగ్ధ బ్రాహ్మణాధములఁబాల్పడినది. విరూపాక్షపీఠాధీశ్వరులగు నుద్దండభారతుల యనంతరము శ్రీ పీఠపు పత్రములు విరూపాక్షశాస్త్రిచే నపహరింపఁబడుటచేతనుఁ బిమ్మట శ్రీ పీఠాధీశ్వరులకు పుష్పగిరిమఠపు వ్యవహారము దెలియకుండుటచేతనుఁదెలిసినను వ్యవహరించుటకుఁ దగునాధారములు లేకపోవుటచేతను అట్టి తరుణమునఁ గప్పట్టి పుష్పగిరి మఠమును శాపదగ్ధ బ్రాహ్మణాధములు పుష్కలముగ నాక్రమించుకొని దుర్మార్గములకు గడంగిరి. విరూపాక్షశాస్త్రిచే దొంగిలింపఁబడిన పత్రములఁజేకొనిన హంపి పీఠపు బ్రాహ్మణాధములు పుష్పగిరిని కప్పముగట్టమని వేధింప వారలను పుష్పగిరి వారనర్హులుగ బ్రకటించుచు వచ్చిరిగాని తమ గురుపీఠమునందు శ్రద్ధాభక్తులఁ గల్గియుండుటకు మారుగ గురు ద్రోహులుగఁబరిణమించిరి. వీరలుఁగూడ శృంగగిరి బ్రాహ్మణాధములట్ల పుష్పగిరి మఠమునకు మురికి,

నాటి యజుర్వేదీయ బాల బ్రహ్మచారియే యధిపతిగ నుండవలయునను సిద్ధాంతమునకు దిగిరి. వాస్తవముచేఁ బుష్పగిరి నాక్రమించుకొనినవారలు సర్వవిధముల శృంగగిరి నాక్రమించుకొనినవారలకు సమానులును సోదరులునని ముల్లోకము లెరింగిన విషయమే. దానంజేసి వీరలుభయులునుఁ బీఠములఁ బ్రధానముగఁ జేసికొని కలహించు వాడుకయునుఁగలదు. వారలలో వారికి శత్రుత్వమిత్రత్వము లెట్లు లుండినను భారతీ సాంప్రదాయమునకును వైదిక ధర్మమునకును శృంగగిరి పుష్పగిరి పీఠములవారలు సర్వవిధముల శత్రువులుగను వంచకులుగనుఁబరిణమించిరి. ఇట్లేమురికినాటి బాలబ్రహ్మచారినియమ మప్రతిహతముగ 1922 వ సం॥రము మేయి 7 వ తేదీవరకు పుష్పగిరి మఠమున నడచినది. కాని యిచ్చటనొక యద్భుతము జరిగినది. క్రీ వె 1906, 7 ప్రాంతమున పుష్పగిరి పీఠమున నొక మురికినాటి బాల బ్రహ్మచారి సుమారు పండ్రెండు సం॥రముల ప్రాయమువాడు సన్యాసి వేషము వేయింపఁబడి విద్యాశంకర భారతుల నుపేరఁగూర్చుండ పెట్టబడెను. ఆతనికి పల్లురాళ్ళపల్లి కాపురస్థులగు చప్పల్లి పెదవెంకటసుబ్బయ్యాచిన వెంకటసుబ్బయ్యానువారలు సర్వాధికారులుగ వ్యవహరింపుచుండెడివారలు. ఈపిల్లసన్యాసితోఁ బాటుగ దాగిడివిల్లి కాపురస్థుడగు బోయలగుంట సుబ్బనరసయ్యా యనునాతడు పీఠముకడ నొకయుద్యోగిగా జేరెను. ఈ సుబ్బనరసయ్య పీఠము నతి నైపుణ్యముతో నడపుటనుజూచి సర్వాధికారుల లనతఁజెంది యాతనధార్ధిగారిగా నియమించి యింటియందు సుఖంబున నిద్రింపనారంభించిరి. ఎట్టి పరిస్థితులు ప్రసరించెనో భగవంతుడెరుగుగాక! విద్యాశంకర భారతులను మురికినాటి సన్యాసి 1922వ సం॥రము మేయి 6వ తేది శనివారము రాత్రి 72 బాకుపోటులు పొడువఁబడి ఘోరహత్య గావింపఁబడి కాలధర్మము నొందెను. పల్లురాళ్ళపల్లివారి నియమము ననుసరించి మురికినాటి బ్రహ్మచారియే సన్యాసిగఁ జేయఁబడినచో సుబ్బనరస్సయ్యా యధార్ధికారిగనే యుండవలసివచ్చునో లేక మానుకొనవలసివచ్చునో దైవమెరుగును. అట్టితరుణమున నీసుబ్బనరస్సయ్యా ఆదివారమునాడు ఉదయము తొమ్మిదిగంటలకు నొక వెల్నాటిఘోటక బ్రహ్మచారికి ముండనము సేయించి జందెము త్రెంపించి కాషాయముగట్టించి పోలీసు ఉద్యోగస్థులు వచ్చువరకు నచ్చట గూర్చుండబెట్టెను. ఈబ్రహ్మచారి గింజుపల్లి చక్రయ్యాయను వాడు పుష్పగిరిపీఠముకడ వంటలవండువాడును. ఈతనికి సుబ్బనరసయ్యాచే నృసింహభారతియను నామకరణము

గూడఁ జేయఁబడి వ్యవహారమునుఁ గనుచున్నది. నాటంగోలె నేటివఱకును సుబ్బనరసయ్యా సర్వాధికారిగ వ్యవహరింపుచు నీసన్యాసిని గంగిరెద్దువలె దేశములందు ద్రిప్పుచుఁ జమత్కృతుల సలుపుచున్నవాడు. పుష్పగిరి మఠమిట్టి దుస్థితిలో నుండుటనుఁజూచి శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వరులగు జగద్గురు శ్రీకల్యాణానందభారతీ మహాంతాచార్య స్వాములవారు అచటి దుర్మార్గముల సామ్యముగ వారింప యత్నింప నయ్యది విఫలమయ్యె దానంజేసి పుష్పగిరిసొత్తుల నాక్రమించుకొని నిజేచ్ఛ జరించుచున్న దుర్మార్గుల నార్గురను 1—9—24 తేదీని బహిష్కరింపుచు బహిష్కార శాసనమునుఁ జాతుర్వర్ణ్య శిష్యబృందములకు నంపించి యున్నారలు. ఇట్టి దుస్థితిని దొలగించి పుష్పగిరి మఠమును సన్మార్గముననుంచ శ్రుతిస్మృతి సదాచార బద్ధులు సర్వవిధముల యత్నింపుదురుగాక! ఇయ్యది పుష్పగిరి మఠమునందలి భారతీ సాంప్రదాయ ప్రస్తావము. ఇతి నారాయణ స్మృతిః

## —:ఆమని మఠము:—

మైసూరు రాష్ట్రమున కోలారు జిల్లాలో ఆమని మఠ మొకటి యున్నదట. అందలి పరిస్థితులంతగా లోకమునకుఁ దెలియరావుగాని యొక విషయము సుప్రసిద్ధము అమని మఠస్థులగు విద్యాశంకర భారతులను నాతడు మైసూరు రాష్ట్రమును విడచి సంచారము సేయుచు గ్రమక్రమంబుగ నైజాము రాష్ట్రము ప్రవేశించి యందు మానుకోట (మహబూబాద్) యను గ్రామమున 1925 వ సం॥రము ఏప్రిల్ 11 వ తేదీని నిరాధారముగగాల ధర్మము నొందెను. వారికి సన్యాసి శిష్యులెవ్వరు లేకపోవుటచే వారిసొత్తు నైజామువారిచే జాగ్రత్త పెట్టబడి మైసూరువారికి వప్పగింత పెట్టబడినది, ఈ నడుమ మైసూరు ముజ్రాయిడిపార్టుమెంటువారిచే నొక వెల్నాటి బ్రహ్మచారి సన్యాస మిప్పింపఁబడి యుపదేశరహితముగ పీఠాధిపతిగఁ జేయబడినట్లుఁ దెలియవచ్చినది ఇట్టి యేర్పాటు ఈ 1927 వ సంవత్సరము నందాశ్వయుజమాన ప్రాంతమున జరిగినట్లు విన వచ్చెడిని

## —:కూడలి మఠము:—

మైసూరు రాష్ట్రమున కూడలి మఠమనునది యొకటి భారతీ సాంప్రదాయమునకు నిలయముగా వినవచ్చెడిని అయ్యదిగూడ స్వరూపస్వభావములకు పైనుదహ

రింపబడిన శృంగగిరి మొదలగు పీఠములకు సమానమగు మర్యాదలతోఁదుల దూఁగుచునే యున్నట్లు దెలియవచ్చుటచే నద్దాని గూర్చి ప్రత్యేకముగ వర్ణింప నవసరములేదు.

## —:శివగంగమఠము:—

ఆమని, కూడలి పీఠమర్యాదలతోఁ దులదుదూఁగు శివగంగ మఠమొకటి కూడగలదట ఇయ్యది కూడ పైమఠములట్లు కృత్రిమ భారతులకు నిలయమని వేరఁ జెప్ప నక్కరలేదు

ఆమని, కూడలి, శివగంగమఠములు శృంగగిరియొక్క దుర్నయము వలన బయలు వెడలినట్లు దెలియవచ్చెడిని వీటియొక్క నామరూపములంతగా లోకమునకు దెలియరావు ఏలనన నియ్యవి యించుమించుగా నూటయేబది సంవత్సరముల లోపున శౌపదగ్ధబ్రాహ్మణులచే లేవనెత్తబడిన కృత్రిమ పీఠములుగాని యధికార పీఠములుగావు ఈపీఠము లందలి భారతులు కృత్రిమ భారతులుగాని శ్రుతిస్మృతిసదాచారసిద్ధమగు భారతీ సాంప్రదాయమువార లెంత మాత్రమునుగారు.

## —:సారాంశము:—

శృంగగిరి పుష్పగిరి మఠముల నాక్రమించుకొనిన శౌపదగ్ధబ్రాహ్మణులునుఁ దత్తుల్యులగు శౌపదగ్ధ బ్రాహ్మణులునుఁ బ్రసరించినంతకు భారతీసాంప్రదాయము సర్వవిధముల నంతరించి కృత్రిమ భారతులు బయలువెడలుచున్నారని నిస్సందియముగఁ జెప్పనగును. వీరలనుజూచి యింకనుఁ గ్రొత్తభారతులునుఁ గ్రొత్తపీఠములును గుక్కగొడుగులట్లు బయలుదేరుచున్నవి. బయలుదేరనున్నవి. ఇట్టిపరిస్థితులందు గొప్పవిశేష మొక్కటిమాత్రము గలదు. పై శౌపదగ్ధబ్రాహ్మణాధముల దృష్టి ప్రసారము ఉత్తర సర్కారులందు మాత్రము నేటివరకు బ్రసరించలేదు. బ్రసరించిననుఁ బ్రయోజనమును గనలేదు. దానంజేసి యుద్దండభారతులు దత్తమండలమునుండి యున విరూపాక్షమునుండి వెలువడి యుత్తరసర్కారులందు మచిలీబందరున సిద్ధిపొందినది మొదలు శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠముత్తర సర్కారులలోన దైవవశమునఁ జిక్కి యుండుటంజేసి నేటివఱకును శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమునందు మాత్రము శ్రుతి

స్మృతి సదాచారసిద్ధమగు భారతీసాంప్రదాయము సకలమర్యాదలతో నలరారుచుఁ బ్రకృతమున శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్యస్వాములవారియందుమూర్తీభవించియున్నదని ప్రకటించుటకునెంతయు బరమానందము బొందుచున్నారము, ఇదియును దైవచిత్రమే! కావున భారతీయు లెల్లరునుఁ బరమానందమునఁ బ్రయోజనమునుఁ గనియెదరుగాక!

" ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత॥ "

ఇతి నారాయణ స్మృతిః॥

ఋష్యశృంగపుర శ్రీకల్యాణానంద భారతీ మాంతాచార్యస్వాములు

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరుల బిరుదావళీ:—

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారావార పారీణయమని యమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరా ప్రాప్తసాంప్రదాయిక షడ్దర్శన స్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థప్రకాశక సాంఖ్యత్రయీ ప్రతిపాదక సకలనిగామాగమ సారహృదయ వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర విద్యానగరాది మహారాజధానీ కర్నాటకసింహాసన ప్రతిష్ఠాపనాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగగిరి పురవరాధీశ్వర శ్రీవిరూపాక్షాధీశ్వర శ్రీమదాచార్యాన్వయ పరివృఢ శ్రీమద్రాజాధిరాజమహారాజ గురు భూమండలాచార్యాద్యనేక సకలబిరుదావళీ విరాజమాన శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీసంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీబోధానంద భారతీమాంతాచార్య మహాస్వామి కరకమల సంజాత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్య స్వాములవారు.